Approved by the M. T. B. C. V.
Gazette dated 9—4—రు లు

# BALA VEERULU.

Illustrated by Y. S. RAO.

*Publishers*
**Karra Autchiah & Sons,**
RAJAHMUNDRY.

శ్రీ ర స్తు

# బా ల వీ రు లు

గ్రం థ క ర్త:

డి. సీతారామారావు.



ప్రకాశకులు:

కరాణి అచ్చయ్య అండ్ సన్సు

రా జ మ ం డ్రి.

1930



[వెల 0—7—6.

# విషయసూచిక



పేజీ



చిత్రపటములు.

# పీఠిక

తల్లిదండ్రులు తమ పుత్త్రుని వీరాగ్రేసరునిగను, ధర్మతత్పరునిగను, రాజభక్తునిగను జేయఁదలంచినచో దిగంతఖ్యాతి వహించిన మహనీయుల చరిత్రములఁ బఠింపఁజేయవలయును. గురువులు కూడఁ దమశిష్యుల హృదయ కేదారములయందు మహనీయుల సద్గుణ బీజములను నాటవలయును. అట్టి మహానుభావులు మనపురాణములయం దెందఱో బేర్కొనఁబడియున్నారు. "ఎప్పుడును సత్యమునే పలుకుము; ధర్మనిష్ఠుఁడవైయుండుము. పితృమాతృభక్తితత్పరుఁడవై మెలంగుము. గురుని దైవముగాఁ జూడుము. ప్రభుభక్తిగలిగి విలసిల్లుము." అనియే తల్లిదండ్రులును, గురువులును, బాలురకు బోధింపవలయును. చదివిన, నాహ్లాదముగ నుండు పౌరాణికకథలు వారిచేఁ బఠింపింపవలయును. ఈయుద్దేశముతోడనే నే నీ "బాలవీరులు" అనుగ్రంథమును రచించితిని.

ఇందుఁ బేర్కొనఁబడినవారు — బాల్యమునందే తమ యసమానసద్గుణములచేతను, భక్తిచేతను, శౌర్యముచేతను, భువనవిఖ్యాతిఁ గాంచినవారు. చిన్నతనమునందే తనచిత్తమును

హరి యందు నిలిపి, జగత్తంతయు విష్ణుమయం బని తలంచి, హరిచింతనము మాను మని విష్ణుద్వేషి యగు తనతండ్రి యెంత చెప్పినను, శిక్షించినను, హింసించినను,వినక పిపీలికాదిబ్రహ్మ పర్యంతము సమస్త ప్రదేశములయందు హరియున్నాఁ డని ధిక్కరించి పలికి సభాస్తంభమునఁ దండ్రికి శ్రీహరిం జూపిన వాఁడు ప్రహ్లాదుఁడు. పినతల్లి యగుసురుచి యాడినదురుక్తులచే రోషమువహించి యరణ్యమున కేగి ఘోరమైన తపస్సు జేసి శ్రీమన్నారాయణునిఁ బ్రసన్నునిగాఁ జేసికొని, ధ్రువమైన పదవిఁ బొంది బ్రహ్మకల్పమువఱకుఁ దానును దనకీర్తియు నెగడునట్లు మహోదాత్తగుణంబులఁ బ్రకటించినవాఁడు ధ్రువుఁడు.

మహావీరాగ్రేసరుఁడై, యోధాగ్రగణ్యుల కభేద్య మగుపద్మవ్యూహము నొంటిమై ననాయాసముగ భేదించి, యసమసమరక్రీడచే విపక్షపక్షమునందలి యతిరథమహారథుల నెల్ల డిల్లపడఁ జేసి, సంగరరంగము నల్లకల్లోలము గావించి "తేజోనిధికి వయసు కారణ మగునే" యనునట్లు శైశవము నందె, యాచంద్రార్కతారావనీ శరధిస్థాయిగ నుండునట్లు యశ మార్జించి నిర్జరలోకమున కేగినవాఁడుసుభద్రాకుమారుం డగు నభిమన్యుఁడు. వాల్మీక్యాశ్రమమునఁ బూతచరిత్రయు,

జగన్మాతయగు సీతకు జనించి, సమస్తశస్త్రాస్త్రవిద్యల నభ్యసించి, తమకుఁ దండ్రియని తెలియక, శ్రీరాముని క్రతుతురంగమును బట్టుకొని, భరతలక్ష్మణశత్రుఘ్నులకుఁ దమ శౌర్యముఁ బ్రకటించి, తుదకుఁ దండ్రియగు రామునిఁ గూడ నద్భుత మందఁ జేసినవారు కుశలవులు. వదాన్యులలో నగ్రగణ్యుఁడును వీరచూడామణియునగు కర్ణునకుఁ బుత్రుఁడై, యాతనిమరణానంతరమునఁ బాండవులయొద్దనుండి మహావీరుఁడని పేరుగొన్నవాఁడు వృషకేతుఁడు.

ఈ బాలవీరశిఖామణుల చరిత్రము లొక్కొక్క బాలునకు నాదర్శములని నేను వేఱుగఁ జెప్ప నక్కఱ లేదు. కావున నీగ్రంథమును ప్రతిబాలుఁడును జదివి, యుత్తమజ్ఞానసంపన్నుఁడై వెలయుఁగాత!

రాజరాజేశ్వరీసదనము,<br>తెనాలి.<br>1—1—1928.

ఇట్లు,<br>దొ. సీతారామారావు.

శ్రీరస్తు.

# బాలవీరులు



## 1 ప్రహ్లాదుఁడు



మున్ను బ్రహ్మమానసపుత్రు లయినసనకసనందను లనుమునీంద్రులు శ్రీహరి దర్శించుటకు వైకుంఠమున కేఁగి హరిమందిరముఁ బ్రవేశింపఁబోయిరి. అప్పుడు మొగసాలనున్న జయవిజయు లనుమందిరపాలకు లామునీంద్రులను లోనికిఁ బ్రవేశింపనీక వారించిరి. అందులకుమునీంద్రులలిగి, యాజయవిజయులను రాక్షసులై పుట్టుఁ డని శపించిరి. శాపమునకు భయంబంది వారు తాపసోత్తముల పాదములపైఁ బడి వేఁడికొనఁగాఁ గ్రమ్మఱ సనకసనందనులు కరుణించి హరితో వైరంబు మూఁడుజన్మములకుఁ బాటించుచు నమ్మహాత్ముని సన్నిధానముఁ జేరఁగలుగుదు రని వచించిరి. ఆజయవిజయులే హిరణ్యకశిపుహిరణ్యాక్షులై భూతలంబున దితిగర్భమున జనించిరి. అందుఁ గనీయుం డైన హిరణ్యాక్షుఁడు వరాహరూపుండగు హరిచే వధింపఁబడెను.

తమ్మునిచావు విని యగ్రజుండైన హిరణ్యకశిపుఁడు మిగుల విచారించి, తల్లిని మఱఁదండ్ర నోదార్చి, హరిపైఁ బగ సాధింపఁ దలంచి, మంత్రుల నెల్లర రావించి వారిఁ జూచి యిట్లు పలికెను. "మంత్రులారా! నాకుఁ దమ్ముఁడును మీకు హితుఁడునగు హిరణ్యాక్షుని శ్రీహరి సూకరవేషమునఁ జంపినాఁడఁట! ఈ వార్త మీరువింటిరికదా! ఆశ్రీహరి యెచ్చట నున్నను సాధించి, వధించి వానిరక్తమున నాతమ్మునకుఁ దర్పణము సేయవలయును. ఈతఁడు మడిసెనేని, దేవతలందఱును మడిసినయట్లే. మీరు భూమితలం బెల్లఁ జరింపుఁడు. శ్రీహరిని వెదకుఁడు. మఖదీక్షితులఁ దపస్స్వాధ్యాయదానవ్రతస్థులఁ జంపుఁడు. శ్రీహరి యనఁగా నెక్కడనో యుండునని మీరు తలంపవలదు. అతఁడే యజ్ఞము. అతఁడే వేదము. సమస్త భూదేవక్రియలకు నాతఁడే మూలము. సకలధర్మములకు నాతఁడే యాధారము. ఎచ్చటగోవులు, భూసురులు, వేదములు, వర్ణాశ్రమధర్మములు నుండునో యచ్చట నాతఁడు తప్పక యుండును. కావున మీ రాస్థలము లన్నియు ధ్వంసము సేయుఁడు."

ఇట్లు పలికి, యాదానవేంద్రుఁడు బ్రహ్మంగూర్చి తపస్సు చేసి, గొప్పవరములు వడసి వచ్చుటకు మందరాచలంబున కరిగెను. హిరణ్యకశిపుఁ డూర లేఁడుకదా యని దేవేం

ద్రుఁడాతనిపురముపై దాడి వెడలివచ్చి, రాక్షసులనెల్ల యుద్ధమునఁ బాఱఁదోలి, యంతఃపురముఁ బ్రవేశించి, హిరణ్యకశిపునిభార్యయగు లీలావతిని జెఱపట్టుకొనిపోవుచుండెను. అప్పు డామె పరిపూర్ణ గర్భవతియై యుండెను. తన్ను విడువు మని యామె మహేంద్రు ననేకవిధముల బ్రతిమాలుకొనెను. కాని, లాభము లేకపోయెను. ఇంద్రుం డట్లామెను గొనిపోవు చుండఁగా, నామెయార్తనాదము విని, నారదమునీంద్రుఁడు వచ్చి యింద్రునిఁ జూచి "అమరేంద్రా ! నీవు సమస్తధర్మముల నెఱింగినవాఁడవు. అట్టిచో సాధ్వి యగు నీమెను హరించుట ధర్మమా !" యని యడిగెను. ఆమాటల కింద్రుఁడు "మునీంద్రా ! నేను మఱియొకవిధ మయిన దుర్బుద్ధిఁ బూని యీమెను జెఱపట్టుకొని పోవుట లేదు. ఈమె భర్త యెట్టి జగద్ద్రోహియో నీ వెఱుంగుదువు. ఇప్పు డీమె గర్భవతియై యున్నది. ఈమెకుఁ బుట్టుపుత్రుఁ డెట్టిక్రూరకర్ముఁడై లోకముల బాధించునో ! కావున నే నీమెను గొనిపోయి, ప్రసూతిపర్యంత మీామెను రక్షించి, జనించిన కుమారుని వధించి, పిదప నీమెను విడిచిపుచ్చెద. ఇదియే నాతలంపు" అని బదులు చెప్పెను. అందులకు నారదుఁడు మహేంద్రునిఁ జూచి "అమరేంద్రా ! ఇదియా నీతలంపు. చాలుఁ జాలు. ఈమె గర్భమున నున్నకుమారుఁ డెవ్వరిచేతను జావఁడు.

ఆతఁడు పరమభాగవతోత్తముఁడు. ఆతనివలన సమస్త లోక ములకును మేలు కలుగు" నని చెప్పి, యాలీలావతిని విడిపించి తన యాశ్రమమునకుఁ దీసికొనిపోయెను.

లీలావతికిఁ బరిచర్యలు సేయుటకై నారదుఁడు తాపస కన్యల నియమించెను. లీలావతియు మునీంద్రునియందు భక్తి గలిగి, యాతనికి శుశ్రూష గావించుచు, నాతనివలన సమస్త ధర్మముల నెఱుంగుచుండెను. కాలక్రమమున నామె యొక శుభదినమున నొకకుమారునిఁ గాంచెను. ఆతఁడే ప్రహ్లాదుఁడు.

తపస్సు సేయుటకు సుందరపర్వతమున కరిగిన హిరణ్య కశిపుఁడు పరమనిష్ఠఁబూని నిశ్చలమైన చిత్తముతో బ్రహ్మం గూర్చి ఘోరమైనతపము సేయఁదొడంగెను. ఆతని యతిదా రుణమైన తపము సర్వలోకములకు నతిసంతాపకరంబై యుం డెను. నిలింపులు దాని సైరింపఁ జాలక బ్రహ్మసన్నిధికిఁ బోయి యిట్లు విన్నవించిరి. "భారతీరమణా! దితికొడుకగు హిరణ్యకశిపుఁ డిప్పుడు మందరాచలంబున ఘోర మైన తపస్సుఁ జేయుచున్నాఁడు. తపోబలమున నీవు జగముల నెట్లు నిర్మాణము చేసి దేవతలలోఁ బెద్దవైతివో, యాతఁడు నట్లే తపోబలంబున మఱియొకభువనము నిర్మాణము సేయఁదలంచు టయే కాక తనకు నిత్యత్వము సంపాదింపఁ దలంచినాఁడు. కావున నాతనితపంబును వారించి భువనంబుల రక్షింపుము."

దేవతలపలుకులు విని, వారిని భయ మందవల దని చెప్పి పంపించి, యాచతుర్ముఖుఁడు హిరణ్యకశిపుఁడు తపము సేయుచున్న ప్రదేశమునకు వచ్చెను. హిరణ్యకశిపుఁడు నియమయుక్తుఁడై తపము సేయుచు, మేదోమాంసరక్తములు పిపీలికలచే హరింపఁబడుటంజేసి శల్యావశిష్టుఁడై యుండెను. బ్రహ్మ యాతనిం జూచి వెఱఁగుపడి, సమీపించి "ఓనిశాచరకులేంద్రా! నీవలె నట్టియుగ్రమైనతప మింతకుముం దెవ్వరును జేయలేదు. ఇంక ముందుఁగూడఁ జేయరు. అన్నము జలము నొల్లక శరీరమున నిట్లెవ్వరు ప్రాణముల నిలుపఁగలరు? నీతపంబున కెంతయు మెచ్చితిని. నీకోరికలఁదీర్చెద. లెమ్ము." అని పలికి, యాతనిశరీరమునఁ దన కమండలుజలంబులు ప్రోక్షించెను. కమలాసనుని కమండలుజలములు మేనఁ బడినయంతనే, వజ్రసన్నిభ దేహుఁడును, సువర్ణవర్ణుఁడును, మార్తాండతేజోవిరాజమానుఁడును నై, యాదానవేంద్రుఁడు తపము నుండి లేచి, చతుర్ముఖునిపదకమలములకు మ్రొక్కి యనేక విధములఁ బ్రస్తుతించి, "దేవా! కోరినవారి కోర్కులఁ దీర్చి, రక్షించుట నీకే చెల్లును. నాకోర్కులు దీర్చెద నని యానతిచ్చి యుంటివి. నీవు నిశ్చయముగా నాయందు దయఁ బూని వరంబు లీయఁ దలంతువేని నాకోరినవి యొసంగుము.

శా. గాలిం గుంభిని నగ్ని నంబువుల నాకాశస్థలిన్ దిక్కులన్
నేలన్ ఘస్రములన్ దమఃప్రబలభూరిగ్రాహరక్షోమృగ
వ్యాళాదిత్యనరాదిజంతుకలహావ్యాప్తిన్ సమస్తాస్త్రశ
స్త్రాళిన్ మృత్యువు లేనిజీవనము లోకాధీశ యిప్పింపవే.

అదియునుం గాక రణమున నా కెదురు లేనిపరాక్రమ మును త్రిభువనవిజయమును గటాక్షింపుము." అనిపలికినం దానవేంద్రునితపమునకు సంతసించి యాతఁడుకోరినవరములన్నియు నిచ్చి "దైత్యేంద్రా! ఇట్టివరంబు లెవ్వరునుఁ గోరరు. కోరినను నొసంగను. నీవు నన్నుఁ దపంబున మెప్పించినకారణమున, దుర్లభము లయినయీవరముల నిచ్చితిని. బుద్ధిసంపన్నుఁడవై యుండు" మని పలికి యవ్విరించి నిజలోకమున కరిగెను.

ఇట్లు భారతీరమణునిచే వరంబుల నంది దానవేంద్రుఁడు నిజపురంబునకు వచ్చెను. ఆతఁడు లేనిసమయమున నిందుఁడు వచ్చుటయు, లీలావతిని జెఱఁగొని పోవుటయు, రాక్షసులచే నాతఁడు విని, తోఁకఁ ద్రొక్కినపామువలె మండి పడుచు, దేవతానగరిపై దాడివెడలఁ దలంచుచుండెను. అంతలో నారదుఁడు పుత్రసహితమైన లీలావతిని దోడ్కొని వచ్చి హిరణ్యకశిపున కప్పగించెను. హిరణ్యకశిపుఁడు మునీంద్రుఁడు తనయెడలఁ జూపిన యమూల్యకరుణ ననేకవిధములఁ బొగడి, నందనునిఁ జూచి యానందించెను.

తరువాత హిరణ్యకశిపుఁడు శ్రీహరిని సాధింపఁ దలంచి దిక్పాలుర నెల్లర సంగరంబున నోడించెను. దేవతలెల్లరు నాతనికి దాసులై వర్తించుచుండిరి. ఆదానవుఁడేసమయమున నెవ్వనిపై మరల దండెత్తివచ్చునోయని లోకపాలకులునిరంతరము భయము నందుచుండిరి. ఇంత యేల? సమస్తలోకములకును మనఃప్రాణములకును హిరణ్యకశిపుఁడే రాజై యుండెను. ఇవ్విధంబున నందఱం గెలిచి, యథేచ్ఛం జరించుచున్న దానవేంద్రుని కృత్యంబులకు భయం బంది, బృందారకు లెల్లరును శ్రీమన్నారాయణునుఁనిసన్నిధికేఁ జని నమస్కరించిముకుళితకరకమలురై దైత్యునివలనఁ దా మందుచున్న బాధల నెఱింగించి రక్షింపు మని కోరిరి. సురల దీనాలాపము లాలకించి భగవంతుం డగుశ్రీహరి వారిం గాంచి "అమరులారా! మీకు శుభం బగుగాక! దితిసుతునిక్రూరవ్యాపారం బంతయు వినుచుంటిమి. కాని,వానిని సాధించుటకు సమయముగాకపోవుటచే నూరకుంటిని.

"ఆ. శుద్ధసాధులందు సురలందు శ్రుతులందు
గోవులందు విప్రకోటియందు
ధర్మపదవియందుఁ దగిలి నాయందు వాఁ
డెన్నఁ డలుగు నాఁడె హింస నొందు".

ఇదియుంగాక తన కన్నకొడుకు ప్రహ్లాదుని వాఁడెన్నఁడు బన్నంబులం బెట్టునో, యపుడే యాదానవుఁడునశించును" అని పలికి వారివారి నెలవులకుఁ బంపివైచెను.

—♦ ప్రహ్లాదుని విద్యాభ్యాసము ♦—

"సీ. తనయందు నిఖిలభూతములందు నొకభంగి
సమహితత్వంబున జరగువాఁడు
పెద్దలఁ బొడఁగన్న భృత్యునికైవడిఁ
జేరి నమస్కృతుల్ సేయువాఁడు
కన్నుదోయికి నన్యకాంత లడ్డంబైన
మాతృభావన సేసి మరలువాఁడు
తల్లిదండ్రులభంగి ధర్మవత్సలతను
దీనులఁ గావఁ జింతించువాఁడు
సఖులయెడ సోదరస్థితి జరువువాఁడు
దైవతములంచు గురువులఁ దలఁచువాఁడు
లీలలందును బొంకులు లేనివాఁడు
లలితమర్యాదుఁ డైనప్రహ్లాదుఁ డధిప."

"సీ. ఆకారజన్మవిద్యాదిపరిష్ఠుఁడై
గర్వసంస్తంభసంగతుఁడు గాఁడు
వివిధమహానేకవిషయసంపన్నుఁడై
పంచేంద్రియములచేఁ బట్టుపడఁడు

భవ్యవయోబలప్రాభవోపేతుఁడై
కామరోషాదులఁ గ్రందుకొనఁడు
కామినీప్రముఖభోగము లెన్ని కలిగిన
వ్యసనసంసక్తి నావంకఁ బోఁడు
విశ్వమందుఁ గన్నవిన్న యర్థములందు
వస్తుదృష్టిఁ జేసి వాంఛ యిడఁడు
ధరణినాథ దైత్యతనయుండు హరిపర
తంత్రుఁడై హతాస్యతంత్రుఁ డగుచు."

బాలుం డగు ప్రహ్లాదుఁడు దినదినప్రవర్ధమానచంద్రు నిగతి నభివృద్ధిఁ గాంచుచుఁ దల్లిదండ్రులకుఁ దనముద్దు ముచ్చటలచే ముదము గూర్చుచుండెను. సద్గుణము లన్నియు రూపము గైకొని యక్కుమారునియందుఁ జేరిన వని చెప్పవచ్చును. బాలుఁడైనను నాతనిచిత్త మెప్పుడును హరి యందు నిలిచియుండును. నీరు ద్రావునప్పుడైనను, భుజించునప్పు డయినను, నితరులతో మాటలాడునప్పుడైనను నాతఁడు హరినామచింతనము మఱచియుండఁడు. ఒక సమయమున శ్రీహరి తనతో సంభాషించినట్లే సంతోషించును. మఱియొక సమయమున హరిం బాడుచు గంతులు వైచును. ఒక్కసమయమునఁ దనలోఁ దానె మాటలాడుకొని నవ్వును. ఒక్కసమయమునఁ గేవలము వెఱ్ఱివానివలె లోక మంతయు మఱచియుండును.

తనకుమారుఁ డీవిధంబున నున్నాఁ డని విని హిరణ్య కశిపుం డాతని విద్యాసంపన్నునిఁగాఁ జేయఁదలచి యొక్క దినంబున వాని రావించి,

"క. చదువనివాఁ డజ్ఞుం డగు
జదివిన సదసద్వివేకచతురత గలుగుం
జదువఁగ వలయును జనులకు
జదివించెద నార్యులొద్దఁ జదువుము తండ్రీ!"

విద్య లేకపోవుటచేత నీవు కేవలము జడునివిధంబున నున్నాఁడవు." అని పలికి శుక్రాచార్యుని పుత్త్రులగు చండామార్కుల రావించి, కుమారుని వారికప్పగించి యాతనికివిద్య గఱపి నీతికుశలునిగాఁ జేయుఁడని చెప్పెను.

చండామార్కులు ప్రహ్లాదునిఁ దోడ్కొని పోయి, వాని కీడగు విద్యార్థులతోఁ జేర్చి సమస్తశాస్త్రములు గరపిరి. అంతఁ గొన్నిదినంబు లేగినపిదప నొక్కనాఁడు తనకుమారుఁ డేమివిద్యఁ బఠించెనో యరయఁ దలచిఁ హిరణ్యకశిపుఁడు వానిని రావించి, ముద్దాడి తనతొడపైఁ గూర్చుండఁబెట్టుకొని "తనయా! నీకు గురువు లేమివిద్యఁ గఱపిరి? ఏయే శాస్త్రము లభ్యసించితివి? నీ కెయ్యది భద్రంబై యున్నది?" యని యడిగెను. అందులకుఁ బ్రహ్లాదుఁడు తండ్రికి నమస్కరించి,——

"ఉ. ఎల్లశరీరధారులకు నిల్లను చీకటి నూతిలోపలం
ద్రెళ్ళక మీరు మే మనుమతిభ్రమణంబున భిన్నులై ప్రవ
ర్తిల్లక సర్వము న్నతని దివ్యకళామయ మంచు విష్ణునం
దుల్లముఁ జేర్చి తా రడవి నుండుట మేలు నిశాచరాగ్రణీ."

అని వచించెను. ప్రహ్లాదుని పలుకులు తండ్రి కాశ్చ
ర్యముఁ గలిగించెను. ఆమాటను విని తండ్రి నవ్వుచుఁగుమారునిఁ
గాంచి "కుమారా ! ఎవ రెట్లు పలికిన శిశువు లట్లు పలుకు
దురు. పరపక్షవాక్యంబు లాడు మని నీ కెవ్వరు బోధించిరి?
నీబుద్ధి చూడ నాకుఁ గడుఁ జోద్య మగుచున్నది. పుత్రా!
శ్రీహరి మనకు విరోధి ఆతని నీవు తలఁచెద వేల? నీవు నాకు
బుత్త్రుఁడ వై సందులకు దేవతలను రణమున నిర్జింపవలయును.
గంధర్వులఁ దోలవలయును. అంతియే కాని విష్ణువును స్మరింప
రాదు." అని పలికెను.

తండ్రివాక్యములు విని పుత్త్రుఁడు తనగురువుల
వీక్షించి యిట్లు పలికెను. "మూఢాత్ములు కొందఱు నేను
మీ రనుభేదమును గల్పించుకొని పరమాత్మం డగుహరిని
జూడజాలక యున్నారు. నిశ్చలజ్ఞానసంపన్ను లయినవారు
గాని హరిం జూడఁజాలరు.

"తే. ఇను మయిస్కాంతసన్నిధి నెట్లు భ్రాంత
మగు హృషీ కేశుసన్నిధి నావిధముఁ

గరుఁగుచున్నది దైవయోగమునఁ జేసి
బ్రాహ్మణోత్తమ! చిత్తంబు భ్రాంత మగుచు".

సీ. మందారమకరంద మాధుర్యమునఁ దేలు
మధుపంబు వోవునే మదనములకు
నిర్మలమందాకినీవీచికలఁ దూఁగు
రాయంచ సనునె తరంగిణులకు
లలితర సాలపల్లవఖాదియైచొక్కు
కోయిల సేరునే కుటజములకుఁ
బూర్ణేందు చంద్రికాస్ఫురితచకోరక
మరుగునే సాంద్రనీహారములకు
నంబుజోదరదివ్యపాదారవింద
చింతనామృతపానవిశేషమత్త
చిత్త మేరీతి నిరతంబుఁ జేరనేర్చు
వినుతగుణశీల మాటలు వేయు నేల."

ఆమాటలకు గురులు కోపించి, యట్టిది కూడ దని పలికి, మరల దానవేంద్రుఁ గాంచి "దైత్యేంద్రా! ఈబాలుని మరలఁ జదివించి నీతికుశలునిఁ జేసి తోడ్కొనివత్తు"మని పలికి యాప్రహ్లాదునిఁ దోడ్కొనిపోయి, మరలఁ గొన్ని శాస్త్రములు నేర్పి యొకనాఁడు హిరణ్యకశిపుసన్నిధికిఁ దోడి తెచ్చిరి. ప్రహ్లాదుఁడు తండ్రికి నమస్కరించి నిలిచియుండెను.

దైత్యేంద్రుఁడు కుమారుని లాలించి "వత్సా! నీ వెప్పుడు సమస్తశాస్త్రములఁ జదివి నీతి పారగుఁడ వయ్యెదవో యని వేచియుంటిని. నీవు సమస్తశాస్త్రములఁ జదివితివా? నీవు చదివిన శాస్త్రములలో సారభూతంబైన యొకపద్యముఁ జెప్పి, దాని తాత్పర్యమును జెప్పు" మని పలికెను. ప్రహ్లాదుఁడు తండ్రిని విలోకించి వినయసూక్తుల నిట్లనెను.

తండ్రీ! నన్ను గురువులు సమశాస్త్రములు చదివించిరి. చదువుల కేమి! అనేకము లున్నవి. అందలిమర్మము లన్నియు గ్రహించితిని. ముఖ్యమైనమర్మ మొక్కటి కలదు. వినుము.

"మ. తనువాఙ్మానసముల సఖ్యమును శ్రవణమున్ దాసత్వమున్ వందనా
ర్చనముల్ సేవయునాత్మలో నెఱుకయున్ సంకీర్తనల్ చింతనం
బను నీతొమ్మిదిభక్తిమార్గముల సర్వాత్మున్ హరిన్నమ్మి స
జ్జనుఁడై యుండుట భద్రమంచుఁ దలతున్ సత్యంబు దైత్యోత్తమా.

సీ. కమలాక్షు నర్చించు కరములు కరములు
శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ
సురరక్షకునిఁ జూచు చూడ్కులు చూడ్కులు
శేషశాయికి మ్రొక్కు శిరము శిరము

విష్ణు నాకర్ణించు వీనులు వీనులు
మధువైరిఁ దవిలిన మనము మనము
భగవంతు వలఁగొను పదములు పదములు
"పురుషోత్తమునిమీఁది బుద్ధి బుద్ధి
దేవదేవునిఁ జింతించు దినము దినము
చక్రహస్తునిఁ బ్రకటించు చదువు చదువు
కుంభినీధవుఁ జెప్పెడి గురుఁడు గురుఁడు
తండ్రి హరిఁ జేరు మనియెడి తండ్రి తండ్రి.

సీ. కంజాక్షునకుఁ గాని కాయంబు కాయమే
పవనకుంభిత చర్మభస్త్రిగాక
వైకుంఠుఁ బొగడని వక్త్రంబు వక్త్రమే
ఢమఢమధ్వనితోడి ఢక్కగాక
హరిపూజనము లేని హస్తంబు హస్తమే
తరుశాఖనిర్మిత దర్వి గాక
కమలేశుఁ జూడని కన్నులు కన్నులే
తనుకుడ్యజాల రంధ్రములు గాక
చక్రిచింత లేని జన్మంబు జన్మమే
తరళసలిలబుద్బుదంబు గాక
విష్ణుభక్తి లేని విబుధుండు విబుధుఁడే
పాదయుగముతోడి పశువుగాక."

అని ప్రహ్లాదుఁడు పలుకుచున్న ప్రతివాక్యము శ్రీహరికి సంబంధించినదే. తనకాజన్మవిద్వేషి యగు శ్రీహరిం బుత్రుఁడు తలంచుట దానవేంద్రున కాగ్రహము గలిగించెను. కుమారునకు గురువులే యిట్లుబోధించిరేమో యని యాతఁడు వారిపై నాగ్రహించెను. చండామార్కులు హిరణ్యకశిపుని కోపముఁ జూచి భయంబంది "దైత్యేంద్రా! మే మిట్టిబుద్ధి గరపువారము కాము. ఇది యెవ్వరు నీతనికి బోధించినబుద్ధి కాదు. నీకృపకుఁ బాత్రుల మైనమేము నీకుమారునకు విరోధి శాస్త్రములు బోధింతుమా" యని పలికిరి. అప్పుడు దానవేంద్రుడు కుమారుని విలోకించి "ఓరీ! గురువులు చెప్పని యీ బుద్ధి నీ కెవ్వరు చెప్పిరి? వారిం బేర్కొను" మని యడిగెను. అమ్మాటలకుఁ బ్రహ్లాదుఁ డిట్లు ప్రత్యుత్తర మిచ్చెను. "తండ్రీ! ఇట్టిబుద్ధి యెవ్వరు బోధించినను నలవడదు. వేయేల సర్వశాస్త్రములయందును శ్రీహరిసేవకు మించినది లేదని చెప్పఁబడియున్నది." హిరణ్యకశిపుఁడు కొడుకుమాటల కాగ్రహావేశ పరవశుండై తనప్రక్కనున్న దనుజభటులం గాంచి 'ఈ ప్రహ్లాదునిబుద్ధి మీరు కంటిరా! దైత్యకులాచారముల నీఁటు చేసి భీతియొక్కింతయు లేక శ్రీహరిని సేవించుచు నన్ను దిక్కరించి పలుకుచున్నాఁడు. ఇట్టివీనిని మీరాయిచ్చవచ్చినయట్లు శిక్షించి బుద్ధి దిప్పుఁడని పలికెను.

దైత్యేంద్రునియాజ్ఞ ననుసరించి, యాభటులు ప్రహ్లా దునిఁ గొనిపోయి హరిసేవ విడువు మని యాతని ననేక విధముల శిక్షించిరి. తన్ను దానవు లెన్నిశిక్షలు సేయు చున్నను "శ్రీహరీ ! రక్షింపుము." మనుమాటదప్ప మఱేది యుఁ బలుకకయుండెను. దానవు లాతని శూలముచేఁ బొ డిచినను శరీరము కందలేదు. రుధిరము స్రవింపలేదు. అతఁడు భయమంది పాఱలేదు. రక్షింపుమని తల్లిని జేరలేదు, కు మారునియెడల దానవభటులు చేసినశిక్ష లన్నియు వ్యర్థము లైనవని యూహించి యా హిరణ్యకశిపుఁడు ప్రహ్లాదుని నేనుగుల చేతఁ ద్రొక్కించెను. సర్పములచేఁ గఱపించెను. అగ్నిం ద్రోయించెను. చేయవలసిన ఘోరహింస లన్నియుఁ జేయించెను. ఏమియుఁ బ్రయోజనము లేకపోయెను. ఇన్నివిధ ముల బాధించినను గుమారుఁ డావంతయు నొవ్వక యుండుట కుఁ దండ్రి మిగుల నాశ్చర్య మందెను. ఆశ్చర్యమేకాదు. మ హావిచారసాగరంబున మునింగెను. అట్టిసమయమునఁ జండా మార్కు లాతనిం గాంచి "రజనీచరేంద్రా ! నీవు విచారింప వలదు. చతుర్దశభువనములను నీశాసనంబున నిలిపితివి అట్టిచో నీకుమారునిబుద్ధికి భయం బందెదవా! మే మీతనిఁ దీసికొని పోయి గృహస్థుల కర్హము లయినధర్మముల నువదేశించుచుం దుము. ఇంతలో మాతండ్రి యగు శుక్రాచార్యులుగూడ

వచ్చు" నని పలికి, యాప్రహ్లాదునిఁ దోడ్కొనిపోయి, గృహస్థ ధర్మము లుపదేశింపఁ బ్రారంభించిరి.

ప్రహ్లాదుఁ డొక్కఁడే హరిభక్తుఁడగుట కాదు. గురువులు పాఠశాలయందు లేనిసమయమున నాతఁడు తోడిబాలకులకు హరిభక్తినుపదేశించి వారినిగూడ భక్తులుగాఁజేసెను. శిష్యులెల్లరును గురూపదిష్టశాస్త్రములు మంచివి కావని తలంచి, ప్రహ్లాదునిమార్గము ననుసరించిరి. పుస్తకంబుల నావలఁ బాఱవైచి హరిభజన సేయుచుండిరి. ఇఁక వారిని శిక్షించినందువలనఁ బ్రయోజనము లేదని తలంచి, యాచండామార్కులు హిరణ్యకశిపుం జేరి "దానవేంద్రా! నీకొడు కొక్కఁడే హరిభక్తుఁ డగుటగాక, తోడిబాలురకుఁ గూడఁ దనమార్గ ముపదేశించి యందఱ హరిభక్తులుగాఁ జేసినాఁడు. మేమెంత చెప్పినను నాతఁడు హరిభక్తిని వర్జింపఁడు. ఇఁక మేమాతనిని జదివింపలేము. నీవే యాతని మంచిమార్గమునఁ బెట్టుకొనవలయు" నని పలికిరి.

దేశికులమాటల నాలకించి ప్రళయకాలరుద్రునికైవడి మండిపడుచు హిరణ్యకశిపుఁడు కుమారునిఁ దనకడకు రావించి యాతనింగాంచి, గంభీరరవంబున నిట్లనెను. "ఓరీ! కులద్రోహీ, నాయాజ్ఞ లేనిదే సూర్యుఁ డెండఁ గాయఁడు. గాలి వీవదు. అగ్ని వెలుఁగదు. శమనుఁడు ప్రాణులఁ జంపఁడు. సమస్తబ్రహ్మం

దూరకులును నాకు వెఱచుచుందురు. అట్టిచో నీ వెట్లు నా యాజ్ఞ నుల్లంఘించుటకు సాహసించితివి. వైకుంఠుఁడు జగద్రక్షకుం డని యొత్తి చెప్పుచుంటివి. నే నమరులనుదండించునప్పు డాతఁ డేల వారి కడ్డుపడ రాకయుండెను? హరిని సేవించుచు దైత్యవంశాచారము మంటఁ గల్పుచున్న కులద్రోహి వగు నిన్ను ఖండించెదను. హరి నీకెట్లు లడ్డుపడునో చూచెద. నేను సప్తదిక్కులు గెలిచితిని. దేవతలందఱు నన్నే దిక్కని నమ్మి సేవించుచుందురు. లోకమునను న్న వీరులయం దెల్ల నేనే బలవంతుఁడను. నీ వెవ్వనిబలమును నమ్మి నాకుఁ బ్రతికూలవాక్యము లాడుచుంటివి? నీ కెవ్వరు దిక్కు."

ఇట్లు పలికిన తండ్రివాక్యములకుఁ బ్రహ్లాదుఁ డిట్లు ప్రత్యుత్తర మిచ్చెను.

"కం. బలయుతులకు దుర్బలులకు

బల మెవ్వఁడు నీకు నాకుఁ బ్రహ్లాదులకున్

బల మెవ్వఁడు ప్రాణులకును

బల మెవ్వం డట్టివిభుఁడు బల మసురేంద్రా."

"క. దిక్కులు కాలముతో నే

దిక్కున లేకుండఁ గలుగు దిక్కుల మొదలై

దిక్కుగలలేనివారికి

దిక్కెవ్వఁడువాఁడు నాకు దిక్కు మహాత్మా."

తండ్రీ! నీవు సమస్తలోకముల జయించితివి. కాని నీకు శత్రువులైన యింద్రియంబుల జయింపలేకపోయితివి. ఇంద్రియనిగ్రహము చేసితివేని, నీకు లోకములో శత్రువులే యుండరు. కావున నట్టిది యొనర్చి చిత్తమును మాధవునియందు నిలుపుము."

ఇట్లు నిర్భయముగాఁ గుమారుఁడు పలికిన పలుకులకు నిశాటకులేంద్రుఁడు మఱింత కోపమును బూని, యతనింగాంచి "ఓరీ! చావునకుఁ దెగించి నాకు విరోధియైన హరింగూర్చి యనేకవిధంబుల వచించుచున్నావు. శ్రీహరిని జగన్నాథుఁడని వర్ణించుచుంటివి. నాతమ్ముని జంపిన యాతనికొఱకనేక స్థలములు వెదకితిని. కాని వాఁడెక్కడను బొడగానరాఁడు వాఁడెక్కడ నేరూపమున నుండునో వానిజాడఁ గొంచెము తెలుపుము. నేను వానిఁ దున్మెద" నని పలికెను.

ప్రహ్లాదుఁడు తండ్రిమాటలకుఁ గొంచెమైనను శంకింపక, దరహాసితవదనారవిందంబున నిట్లు చెప్పెను.

"మ. కలఁ డంభోధిఁ గలండు గాలిఁ గలఁ డాకాశంబునం గుంభినిం
గలఁ డగ్నిన్ దిశలం బగళ్ళ నిశలన్ ఖద్యోతచంద్రాత్మలం
గలఁ డోంకారమునన్ ద్రిమూర్తులఁ ద్రిలింగవ్యక్తులం దంతటం
గలఁ డీశుండు గలండు తండ్రి వెదకంగా నేల నీ యా యెడన్"

"క. ఇందుఁ గలఁ డందు లేఁ డని
సందేహము వలదు చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకిచూచిన
నందందే కలఁడు దానవాగ్రణి వింటే"

హిరణ్యకశిపునితోఁ బ్రహ్లాదుఁ డీవిధమునఁ జెప్పునవ సరమున భక్తసంరక్షణపరాయణుం డగు శ్రీమన్నారాయణుఁడు లోకముననన్ని ప్రదేశములయందును నరసింహరూపమున నుండెను. అప్పుడు దానవేంద్రుండు కుమారునిఁ దిలకించి "ఓరీ! డింభకా! శ్రీహరి సర్వస్థలములయందు నున్నాఁడని పలుకుచుంటివి. ఈసభాస్తంభమున నీ వాతనిఁ జూపెదవా! చూపలేకున్న ని న్నిప్పుడే ఖండించెద" ననెను. "బ్రహ్మ మొదలు తృణపర్యంతము నిండియుండు పరమాత్ముం డగు శ్రీహరి యీ స్తంభమున మాత్ర మేలయుండఁడు? నీ వాతని నీ స్తంభమునఁ దప్పక చూడఁగల" వని ప్రహ్లాదుఁడు మనంబున హరికి నమస్కరించి, తండ్రికి వచించెను. అంతట దానవేంద్రుఁడు సింహాసనమునుండి నేలకు లంఘించి ఖడ్గము ఝళి పించుచు "హరిం జూపు" మని పలుకుచు సభాస్తంభము నటు చేతిఖడ్గముతో వ్రేసెను.

అంతట నిజభక్తుండైన ప్రహ్లాదునిమాట ధ్రువపఱచి, రక్షింపఁ దలఁచి, శ్రీహరి నరసింహరూపమున నా స్తంభము

నుండి వెలువడి, యురగేంద్రుం డహిం బట్టుచందమున దాన వేంద్రుఁ బట్టుకొని, కేవల నరరూపమునను, మృగరూపమును గాని నరసింహరూపమున, నాకాశమును భూమియుఁ గాని యూరుభాగమున, శస్త్రాస్త్రములు గానినఖంబుల వధించెను. హిరణ్యకశిపునిమృతికి సర్వదేవతలును సంతసించిరి. ఆసమయ మున నచ్చటికి బ్రహ్మాదిదేవత లందఱును వచ్చిరి. కాని నర హరిరూపుఁ డగు లక్ష్మీకాంతునిమాత్ర మెవ్వరును భయము చేత సమీపింపఁజాలక యుండిరి. హిరణ్యకశిపుని వధించి, ప్రళయకాలరుద్రాకృతి నున్న యాహరిని శాంతునిఁ జేయుట యెట్లని యందఱును నాలోచించుచుండిరి తుద కిక్కార్య మున నాదేవతలచేఁ బ్రహ్లాదుఁడే నియోగింపఁబడెను.

ప్రహ్లాదుఁడు నెమ్మదిగా హరిని సమీపించి చేతులు జోడించి యిట్లు స్తుతించెను. "దేవా! చతుర్దశభువనాధీశ్వరుఁడ వైననిన్ను బ్రహ్మాదిదేవతలును, ఋషులును గూడ సమీ పింప శక్తులు గారఁట. అట్టియెడ దానవడింభకుఁడ నైననేను సమర్థుఁడ నగుదునా! నిన్ను సేవించుటకు ముఖ్యముగా నిర్మలజ్ఞాన ముండవలయును. క్రతువులు, తపములు, దాన ములును జేసితినని గర్వించుచు నీపదధ్యానము మానియున్న బ్రాహ్మణునికంటె, మనోవాక్కాయకర్మములయందు నిన్ను గొల్చుశ్వపచుఁడు శ్రేష్ఠుఁడు. మహాత్మా! అల్పుఁడ నగు

నేను నీతో సంభాషించుటకే భయము బందుచున్నాను. భవదీయ భయంకరస్వరూపంబును జూచి యందఱును భయం బందుచున్నారు. అసురమర్దనంబునకుఁ గదా నీవిట్టిరూపముఁ దాల్చితివి. అవతరించినపని తీఱెను. ఇంక నలుక మాని శాంతగుణము వహింపుము. తండ్రీ! దంష్ట్రివై నీవు మా పినతండ్రిని వధించుటచేత, నాతండ్రి నీయెడల ద్వేషభావము వహించి నీచేఁ జెగి కృతార్థుఁడైనాఁడు."

ప్రహ్లాదునిపలుకులు విని నరసింహదేవుఁడు శాంతభావముఁ దాలిచి, తనకరాంబుజముచే నతని శీర్షము నంటి "ప్రహ్లాదా! నీవు నాకు నిజమైనభక్తుఁడవు. నాయెడల వైరము సాధింపఁదలచి నీతండ్రి నిన్నెట్టికష్టములఁ బెట్టినను నోర్చి, నన్నె నమ్మిన వీరభక్తశిఖామణివి. నాచేఁగూలుటంజేసి నీతండ్రి సుగతికిఁ బోవును." అని వచించి యాతని కనేకవరము లిచ్చి బ్రహ్మాదిదేవతలఁ గూడి నిజలోకమున కేగెను.



# 2 ధ్రువుఁడు.

---

ఉత్తానపాదుండను నరపాలునకు సునీతియు సురుచియు నను నిరువురు భార్యలుండిరి. ఆనరపాలుఁడు ధర్మవ్రతాచార పరాయణుఁడును, సత్యసంధుఁడునై యుండినను, మోహమును మాత్రము జయింపలేకపోయెను. ఆతనికి సురుచియందధికాను రాగ ముండెను. సునీతియందు ధ్రువుఁడును, సురుచియందు నుత్తముఁడు ననుకొడుకు లాతనికి జనించిరి. ఆతఁడు సురుచియం దెక్కువ మోహము గలవాఁ డగుటచే నిరంతర మామెమందిరమందే యుండును. సునీతిని గంటనైనఁ జూడక యుండెను. ఇట్లుండ నొకనాఁ డుత్తానపాదుఁడు సురుచిమందిరమున నుత్తమునిఁ దనయంకమునఁ గూర్చుండఁ బెట్టుకొని, ముద్దులాడుచు సురుచితో నిష్టగోష్ఠిం బ్రొద్దుపుచ్చుచుండెను. ఆసమయమున నచ్చటికి సునీతిపుత్రుం డగు ధ్రువుఁడు వచ్చెను. అక్కుమారుఁడుగూడఁ దండ్రియంక మెక్కుట కుత్సాహ మంది, తండ్రిని సమీపించెను. ఉత్తానపాదుని ప్రక్క నున్న సురుచి ధ్రువుని యుత్సాహకారణ మెఱింగి యక్కుమారుని చేతిఁ బట్టుకొని "కుమారా! నీసంభ్రమకారణము నాకుఁ దెలియును. ఇట్టి యుత్సాహమువలనఁ బ్రయోజనము లేదు. నీవు తండ్రితొడ నెక్కుభాగ్యము నోఁచుకొని

యుంటివేని నాగర్భమునందే పుట్టియుందువు. ఇప్పుడైనను నీవట్టిభాగ్యము నందఁదలఁచితివేని శ్రీమన్నారాయణుని నాశ్రయింపు" మని పలికి వారించెను.

ఇట్లు పినతల్లియాడిన యసహ్యాకరములయిన వాక్యము లాకుమారుని హృదయమునకు శరములవలెఁ దగిలెను. ఆమె యట్లు పలుకుచుండుటకుఁ దండ్రి సహించియుండుట యాతని చిత్తమును మఱింతదుఃఖమున ముంచివైచెను. బాలకుండైనను నాఁతఁ డాయవమానమును భరింపలేకపోయెను. దండతాడితమైన భుజగమువోలె రోషకలితుం డయ్యెను. కాని యేమి సేయఁగలఁడు? ఆతఁడు రోదనము సేయుచుఁ దల్లి యగు సునీతికడకుఁ బోయెను. కుమారునిదుఃఖకారణ మామె దాసీజనముచే విని, యాతని నంకమున గూర్చుండఁబెట్టుకొని, కన్నీరు దుడుచుచు "వత్సా! నీవు దుఃఖించినందువలనఁ బ్రయోజనము లేదు. సురుచి యాడినపలుకులు సత్యములే. నిర్భాగ్యురాల నగు నాగర్భమున జనించుటచే నీవట్టి పరాభవ మందితివి. పూర్వజన్మకర్మ మెవ్వరికైనను ననుభవింపక తప్పదు. భర్తచేత భార్యయని పిలిపించుకొనఁబడక యుండుటయే కాక కేవలము దాసికంటె నతినీచముగాఁ జూడఁబడుచున్ననాకుఁ గుమారుడవైతివి. ఇఁక నీవు దుఃఖింపవలదు. సురుచి వచించినయట్లు నీవు శ్రీమన్నారాయణునే యాశ్రయింపుము. నీదుఃఖమును

బాపఁగలసమర్థుఁ డాతఁ డొక్కఁడే. ఆతఁడు సర్వలోకరక్షకుఁడు. భక్తపరతంత్రుఁడు. అర్థిజనమందారుఁడు. అమ్మహాత్ముని సేవించుచుండుటచేతనే బ్రహ్మ బ్రహ్మపదంబును బొందినాఁడు. మీతాతగూడ నాశనిక్కృపకుఁ బాత్రుఁడై యనేకయాగములు చేసి సత్కీర్తినందెను. కావున నీ వాభక్తవత్సలునే చిత్తంబున నిలిపి సేవింపుము" అని పలికెను.

తల్లివాక్యములు విని, యాధ్రువుఁడు భగవంతుం డగు నారాయణునిఁగూర్చి తపము సేయఁదలంచి, పురము వెడలి చనుచుండెను. ఆతనికి మార్గమధ్యమున నారదుం డెదు రయ్యెను. నారదుఁ డాతని వృత్తాంతం బంతయు దివ్యదృష్టి నెఱింగి యతనిధైర్యంబున కచ్చెరువు నంది "బాలకా! నీవు పసివాఁడవు ఇట్టివయస్సున మానావమానములతో నీకు బనిలేదు. మందిరంబున నుండి సుఖంబుల ననుభవింపుము. నీ వేడ! భగవంతు డగు హరింగూర్చి తపము సేయుటేడ? పరమనిష్ఠాగరిష్ఠులై కాననంబులలో ఘోరతపం బొనర్చు యోగీశ్వరులే యమ్మహానుభావునిఁ బ్రసన్నునిఁగాఁ జేసికొనఁజాలక యుందురు. సుఖదుఃఖములు దైవవశమునఁ గలుగుచుండును. సుఖమునకుఁ సంతోషింపక, దుఃఖమునకు వగవక యుండువాఁడే ధన్యుఁడు; వాఁడే విమలవిజ్ఞాని. కావున నీవు విచార మందక గృహమునకుఁ బొమ్ము" అని పలికెను. నారదునివాక్యము

లాతనిహృదయమునఁ బ్రవేశింపలేదు. ఆతఁడు శ్రీహరింగూర్చి తపము సేయవలయు ననియే దీక్ష వహించి గృహమునుండి బయలువెడలినవాఁ డగుటచే నారదుని విలోకించి, వినయభావము ప్రకటించుచు నిట్లు పలికెను. "ఓమునిచంద్రా! నాపినతల్లి యాడినదురుక్తులచే నేను నిర్భిన్నహృదయుఁడ నైతిని. నేను శ్రీమన్నారాయణునిగూర్చి ఘోరమైన తపం బొనర్చి త్రిభువనోత్కృష్టంబును ననన్యాధిష్ఠితంబును నగుపదంబు నందఁదలఁచితిని. ఇఁక నాచిత్తము తిరుగదు. దేవా! నీవు బ్రహ్మమానసపుత్రుఁడవు. మహామహిమాస్పదుఁడవు. నీకుఁ దెలియనివిషయములు లోకమున లేవు. కావున నాయందుఁ గృపాంతరంగుఁడవై శ్రీహరినిఁ బ్రసన్నునిగాఁ జేసికొనుటకుఁ దగిన మార్గము నాకుపదేశించి కృతార్థునిఁ జేయుము. నీకు నమస్కరించెద" అని యిట్లు పలికి యామునీంద్రుని పాదములపైఁ బడెను.

ధ్రువునిచిత్తము నిఁక నెవ్వరును ద్రిప్పఁజాలరని నారదుండు తలంచెను. ఆబాలునియెడ నాతఁడు కరుణ వహించి యిట్లనెను: "ధ్రువుఁడా! శ్రీహరియే మోక్షమునకుఁ గర్త, ఆతని మించినదైవము మఱియొకఁడు లేఁడు. నిన్నీతపంబునకు ప్రేరేపించినవాఁ డాతఁడేయని తలంపుము. మానసపు[illegible]సంతాపసాగరంబును ధరించుట కాతనిపాదసేవయే నావ యగును.

కావున నీ వమ్మహాత్మునే యారాధింపుము. శ్రీహరింగూర్చి నిర్మలచిత్తముతోఁ దపస్సు సేయుటకుఁ దగిన ప్రదేశ ముండ వలయును. యమునానదీతీరంబు నున్న మధువనమున నీకుఁ దపమున కుచితమైయుండును. నీ వా వనమును బ్రవేశించి భగవంతుం డగు శ్రీహరిని మనంబున నిలిపి, యేకాగ్రస్థిత మానసుఁడవై తపం బొనర్పుము." అని పలికి, యక్కుమారు నకు వాసుదేవమంత్రము నుపదేశించెను.

ధ్రువుఁడు, నారదునకు నమస్కరించి యాతనిచే మార్గము చూపఁబడినవాఁడై యమునాతటంబున నున్నమధువనం బున కేగెను.

ధ్రువుఁడు నగరము విడిచి యరిగినసంగతి యుత్తాన పాదుఁడు విని, యతనికై మనంబున ననేకవిధములు పరితపిం చుచు, బెంగఁగొని, నిద్రాహారములుమాని, రాజకార్యములు విడిచి నానాఁటికి శుష్కించుచుండెను. నిశ్చయముగా నాత నికి ధ్రువునిపైఁ బ్రేమ లేకపోవలేదు. సురుచియం దున్న మోహముచే నామె ధ్రువుని నాడినపరుషోక్తుల సహించెను. ఇప్పు డాతఁడు వానిం దలఁచుకొని దుఃఖింపఁదొడంగెను. ఇట్లుండ నాతనికడకు నారదుఁడు వచ్చి, యాతని దుఃఖకారణం బెఱింగి "రాజేంద్ర! నీవు ధ్రువునిఁగూర్చి విచారింపవలదు. ఆతఁడు శ్రీమన్నారాయణునిఁ బ్రసన్నునిఁ జేసికొని, సమస్తలోక

పాలావళి కందరానిదివ్యపదంబు నంది, విలసిల్లుము. నీకీర్తి పథీంల లోకంబున శాశ్వతముగాఁ బ్రకాశఁ జేయును. సుఖమై యుండుము. కుమారుని నీవు త్వరలోనే చూడఁగల" వని చెప్పి చనెను. నారదునివాక్యములవలన నుత్తానపాదుఁడు కొంత ధైర్యము వహించియుండెను.

## —♦ తపస్సు ♦—

మధువనంబుఁ జేరిన ధ్రువుఁడు యమునానదిలో స్నాన మాచరించి, తపమునకుఁ దగినప్రదేశముఁ జూచుకొని, పరమే శ్వరుం డగు పుండరీకాక్షుని మనంబున నిలిపి, యాఱుమాస ములు కఠినదీక్షం దపము చేసెను. ఆతనితపమునకు దేవత లెల్లరును భయం బంది శ్రీమన్నారాయణుసన్నిధి కేగి విన్న వించిరి. జగదీశ్వరుం డగురమాకళత్రుఁడు సురులం గాంచి "అసురులారా! ఉత్తానపాదపుత్రుం డగుధ్రువుఁడు నాకొఱ కిట్లు ఘోరతపస్సు సేయుచున్నాఁడు. మీరు భయమంద వలదు. నే నేగి యాతని తపము వారించి వచ్చెద" నని పలికి, యాక్షణంబుననే మధువనంబునకు వచ్చి, తపస్సుఁగూర్చి యేకాంగుష్ఠమున నేల మోపి తపము సేయుచున్న ధ్రువునిఁ జూచి యాశ్చర్యమంది, సమీపించి నిలచియుండెను. ధ్రువుఁ డు కన్నులు తెఱచి, దివ్యమంగళవిగ్రహుం డగునారాయ ణునిఁ జూచి, యతఁడే తన్నుఁ గృతార్థునిఁ జేయుటకు

వచ్చినభగవంతుం డని తలంచి, తత్పాదపద్మములకు నమస్కరించి, స్తోత్రము సేయ నిశ్చయించెను. కాని, బాలుం డగుటచే భగవంతునేవిధంబున స్తుతింపవలయునో తెలియదయ్యెను. శ్రీహరి యక్కుమారునిభావం బెఱింగి, వేదవాక్కులచేఁ బూజింపఁబడిన తనశంఖముచే నాతనికపోలతలం బంటెను దానం జేసి, ధ్రువునకు మహావిజ్ఞాన మలవడెను. శరీరబలము హెచ్చెను. శంఖమువలన భగవంతునివాఙ్మయమైనదివ్యతేజ మాతనియందుఁ బ్రవేశించెను. అంతట నాతఁడనేక విధంబుల సంస్తుతించెను. సత్యసంకల్పుఁడును సుజ్ఞానయు నగు ధ్రువునిభక్తికి సంతసించి శ్రీహరి యాతని విలోకించి యిట్లనెను.

"క. ధీరవ్రత రాజన్యకు
మారక నీహృదయమందు మసలినకార్యం
బారూఢిగా నెఱుంగుదు
నారయ నది పొందరాని దైనను నిత్తున్."

"అది యెట్టిదనిన నెందేని మేదినియందుఁ బరిభ్రామ్యమాణగోచక్రంబునుంబోలె గ్రహనక్షత్రతారాగణ జ్యోతిశ్చక్రంబు నక్షత్రరూపంబు లయినధర్మాగ్నికశ్యపశక్రులును, సప్తర్షులును, దారకాసమేతులై ప్రదక్షిణంబులు దిరుగుచుండుదు, రట్టిదురాపంబును, ననన్యాధిష్ఠితంబును, లోకత్రయపరిశయకాలంబునందు నశ్వరంబు గాక పరికాశమానంబును

నయిన ధ్రువక్షితి యనుపదంబు ముండట నిరువదియాఱువే లేండ్లు సనం బ్రాపింతువు."

నీతండ్రి నీకు రాజ్యాభిషేకముం గావించి తపోవృత్తి నుండుటకు వనంబున కరుగును. నీయనుజుండగు నుత్తముండు వేటకై యరణ్యమున కరిగి యచ్చట మృతుం డగును. ఆతని నన్వేషించుచుం బోయి నీపినతల్లి యగు సురుచియు మరణం బందును. ధ్రువా! నీవు రాజ్యము సేయుచున్నప్పుడు నన్ను గూర్చి యాగములు సేయుము. కావలసిన సౌఖ్యభోగముల ననుభవింపుము. అంత్యకాలమున నన్ను స్మరింపుము. పునరావృత్తిరహితంబును, సప్తర్షి మండలోన్నతంబునునగుదివ్యపదము నందఁగలవు."

భగవంతుం డగు హరి ధ్రువున కట్లు వచించి యంతర్ధానం డయ్యెను. అంతట ధ్రువుండు సంతోషాంతరంగుండై నిజపురమునకు మరలి వచ్చుచుండెను. ఈతడు వచ్చుచుండుట చారులు చూచి కడురయమునం బోయి యుత్తానపాదున కెఱింగించిరి. కుమారుం డెప్పుడు వచ్చునాయని వేచియున్న యారాజేంద్రున కావార్త మహానందమును గలుగఁజేసెను. కుమారునివార్త దెలిపిన చారుల కాతఁ డనేకబహుమతుల నొసంగి, యిరువురు భార్యలును, నుత్తముండును, మంత్రి పురోహితులును వెంటరాఁ గుమారున కెదురుపోయెను. ఈతఁ



నీతండ్రి.............................నందగలవు.

డు నగరసమీపమున నున్న యుద్యానవనమున వచ్చుచున్న ధ్రువునిఁ జూచి, యానందబాష్పములు విడుచుచుఁ గౌఁగ లించుకొనెను. ధ్రువుండును దండ్రికిని, నిరువుర తల్లులకును నమస్కరించి, తమ్ముఁడగు నుత్తమునిఁ గౌఁగలించుకొనెను. ఇప్పుడు సునీతి పొందినయానందమునకు మేరలేదు. సురుచియు మున్ను తాననిన మాటల మఱచి యక్కుమారునిఁ జేరి "వత్సా! భగవదనుగ్రహము వడసినవారికెట్టి కొఱంతలు నుండవు. కమలలోచనుని బ్రసన్నునిఁ జేసికొనినవారు మృత్యువైనను గెలుతురు." అని పలికెను. అనంతర ముత్తానపాదుఁడు ధ్రువునిగజారూఢునిఁజేసి పురంబులోనికిఁదోడ్కొని వచ్చెను. ధ్రువుని రాకకుఁ బ్రజలెల్లరు సంతోషమంది, తమ సంతోషమును బ్రకటించుటకుఁ దమతమగృహములన్నియుఁ దోరణములచే నలంకరించిరి.

శ్రీహరినిఁ బ్రసన్నునిగాఁ జేసికొని ధ్రువునిఁ జూచి యానందించుచు, నుత్తానపాదుఁడు కొన్ని సంవత్సరములు రాజ్యపాలనం బొనర్చి యుక్తవయస్కుఁడై యున్నయక్కుమారునకు రాజ్యాభిషేకము గావించి, తృప్తుడై తపోవనంబును బ్రవేశించెను.

ధ్రువుఁ డఖిలప్రజారంజకుఁడై ధరాతల పరిపాలనం బొనర్చుచుండెను. ఈతనితమ్ముఁ డగునుత్తముఁడు మృగయా

విహారమున నరణ్యమునకరిగి, హిమాచలప్రాంతమున నొక్క యక్షునిచే హతుండయ్యెను. ఆతనితల్లి యగుసురుచి కుమారునికై వగచుచుఁ బోయి గహనదహనంబున దగ్ధయయ్యెను. ధ్రువుఁడు తమ్మునిమరణము విని మిగుల దుఃఖించి, యందులకుఁ గారణము యక్షుఁ డని యెఱిఁగి, యప్పగి సాధింపఁ దలఁచి, రథంబెక్కి శరాసనపాణియై చని, హిమాచల ప్రాంతమున నున్న యక్షనివాసం బగునలకాపురంబుఁగాంచి, యందలి యక్షులతో యుద్ధమునకుఁ గడంగెను. యక్షులకును నీతనికిని భయంకరమైన యుద్ధము జరిగెను. అందు యక్షులనేకులు పడసిరి. అప్పుడు స్వాయంభువమనువు ధ్రువునికడ కరుదెంచి, "వత్సా! మనకులమున కిది యనుచితమైనకర్మము. ఎవ్వఁడో యొకయక్షుఁడు నీతమ్మునింజంపెనని యక్షుల నెల్లఁ గూల్పఁ దలంచుట ధర్మమగునా? నీవు సామాన్యుఁడవుగావు: బాల్యమునఁ బిన్నతల్లి యాడినదురుక్తుల సహింపఁ జాలక, యరణ్యమునకుఁ బోయి, ఘోరతపం బొనర్చి హరిని బ్రసన్నునిగాఁ జేసికొన్న మహనీయుఁడవు. నీ వీయక్షులఁ గూల్చుటంజేసి సదాశివమిత్రుఁడైన కుబేరునియెడ నపరాధముఁ జేసినవాఁడ వైతివి" యని పలికి, యాధ్రువునిఁ గుబేరుని కడకుఁ దీసికొనిపోయి యిరువురకును సఖ్యము గూర్చెను. అనంతరము ధ్రువుఁడు నగరమునకు మరలి వచ్చెను.

ధ్రువుఁడు పెక్కేండ్లు భూమండలముఁ బరిపాలించి, యనేక క్రతువులు శ్రీహరిప్రీతిగఁ జేసి యశము గాంచి, తుదకు విరక్తుఁడై తనకుమారుని రాజ్యమునందు నిలిపి, తపంబుఁ జేసి కొనుటకు వనంబుఁ బ్రవేశించెను. ఆతఁ డాయరణ్యమున ఘోరమైన తపస్సు చేయుచుండఁగా నొక్కదినంబున నాతనికడ కొక్క విమానము వచ్చెను. ఆవిమానమున నున్నవారిని హరికింకరులుగాఁ దలంచి ధ్రువుండు వారికి నమస్కరించి నిలిచి యుండెను. విష్ణుదూతలా ధ్రువునిఁ జూచి "ఓరాజా ! నీకు శుభం బగుఁగాక ! నీవు బాల్యమునఁ జేసినతపమునకు శ్రీమన్నారాయణుఁడు మెచ్చి నిన్నుఁ దోడ్కొని వచ్చుట కీవిమానమంపినాఁడు. నిన్ను మేము మాధవసన్నిధానమునకుఁ దోడ్కొనిపోవుదుము. "ఏపదంబు నేసి సూరిజనంబులు సర్వోత్తమం బని పొందుదురు. దేనిం జంద్రదివాకరగ్రహనక్షత్రతారాగణంబులు ప్రదక్షిణంబుగాఁ దిరుగుచుండునో, మఱియు నీ దుపితరులచేతను, నన్యులచేతను, ననధిష్ఠితంబును, జగద్వంద్యంబును, భక్తజనాతిదుర్లయంబు నయిన యట్టివిష్ణుపదంబుం బొందుదువు. రమ్ము. ఇదే విమానము." అని పలికిరి. ధ్రువుండంతట భగవంతునకు మనంబున నమస్కరించి విమానమెక్కెను. అంత విమానము పోవుచుండెను. కాని, యాతని మనంబున భూతలంబున నున్న తల్లిం దలంచి చింతించుచుండెను.

ఈతనివిచారమును విష్ణుకింకరు లెఱింగి "రాజేంద్రా ! నీవు విచారింపవలదు. నీతల్లికూడ వేఱొకవిమానముపై నుత్తమ లోకమునకుఁ బోవుచున్న" దని పలికిరి.

ఇట్లు ధ్రువుఁడు విమానముపై నరిగి, గ్రహమండల మును, లోకోన్నత మగు సప్తముని మండలమును దాఁటి యవ్వాల నుండు హరిపదమును గాంచెను.

ఆహా! ధ్రువా! బాలుఁడవై యుండియుఁ బినతల్లి యాడినమఱుపుల సహింపఁజాలక, యరణ్యమున కేగినస్థైర్య మును, మహోన్నతపదము నందఁ దలంచి, స్థిరచిత్తమున హరిని సేవించి, యాశయం బీసన్నిధిగాఁ జేసికొని పరమభక్తుని దోఁడిబాలుర కాదర్శముగాఁ జేసితివిక దా!



# 3 కుశలవులు



ఎవ్వఁడో యొకరజకుఁ డాడినమాటపై శ్రీరాముఁడు సీత నరణ్యమునందు విడిచి రమ్మని లక్ష్మణున కాజ్ఞాపించెను. రామునియాజ్ఞ యనుల్లంఘ్యముకదా! రామునియానతి ననుసరించి సంపూర్ణగర్భవతియై యున్నసీతను లక్ష్మణుఁడు రథముపై నెక్కించుకొని పోయి వాల్మీకాశ్రమప్రాంతమున విడిచి వచ్చెను. వాల్మీకి సీతను దనయాశ్రమమునకు దోడ్కొని పోయి, తాపసకన్యల నామె కుపచారము సేయుటకు నియమించెను. వారును నామెయందుఁ గడుభక్తి గలిగి సేవించుచు, నే విధమయిన కొఱంతయుఁ గలుగకుండఁ జూచుచుండిరి. సీతయు దన యెడల నత్యంతకరుణ వహించియున్న వాల్మీకిమహామునియందు వర్ణనాతీత మగు భక్తి గలదై యుండెను. సీతకు రామచంద్రుని విడనాడియుంటి ననుచింత దప్ప మరియొకచింత లేదు. కాలక్రమమున నామె కొకశుభదినమున నిరువురు నందనులు పుట్టిరి. ఆకుమారులకు వాల్మీకి జాతకర్మాది కర్మంబుల నిర్వర్తించి, కుశలవు లనుపేరులు పెట్టెను. ఆకుమారులు సీతచేతనే కాక, తాపసకన్యలచేతఁగూడ రక్షింపఁబడుచు దినదిన ప్రవర్ధమాను లగుచు వాల్మీకికిని సీతకును సంతోషముఁ గలిగించుచుండిరి. తనయులఁ జూచుకొనుచు సీతకొంచెము దుఃఖమును మఱచియుండెను.

కుశలవులకు యుక్తవయస్సు వచ్చినయంతనే వాల్మీకి వారి కక్షరాభ్యాస మొనర్చి కాలక్రమమున సర్వశాస్త్రములును, క్షత్రియోచిత మగు ధనుర్విద్యయు నేర్పెను. అవి యన్నియు నట్లుండ నమ్మునీంద్రుఁడు రామాయణకావ్యమును రచించి దానిని వారిచే గానరూపముగఁ బాడించుచుండెను.

కుశలవులు తమ బాలక్రీడల చేతను, ససమానమైన ధైర్యచర్యల చేతను, నాశ్రమవాసులకును, దల్లికిని గురువునకును మోదము గలుగజేయుచు విరాజిల్లుచుండిరి. ఆకుమారులు బాల్యముచే నొక్కొక్కప్పుడు వాల్మీకికినే ముప్పుతిప్పలు పెట్టుచుందురు. నిద్రవోవునప్పు డాతనిగడ్డము లాగుచుందురు. దండము దాఁచుచుందురు. కమండలుజలములఁ బారఁబోయుచుందురు. ఆతాపసోత్తముఁడు వారికొంటెపనులకు నవ్వుచుండును. గాని కోపింపఁడు. తాతగారి నట్లు సేయవచ్చునా యని తల్లి కోపమందినప్పుడు వా రామెతో "ఆయన మాతాత. మే మేమి చేసినను నాగ్రహింపఁ" డని బదులు చెప్పి నవ్వించుచుందురు. ఇట్టికొంటెపనులే కాక వా రప్పుడప్పుడు సమీపారణ్యమునకుఁ బోయి, సింగములు, వ్యాఘ్రములు మొదలగుక్రూరసత్త్వములఁ బట్టుకొని తెచ్చి యాశ్రమముముందుఁ గట్టివేయుచుందురు. ఇట్టిసాహసకార్యము వలదని తల్లి చెప్పినచో "తల్లీ! మాకు భయము లేదు. నీకుఁ గావలసినచోఁ బులిపిల్లల నెన్ని

యైనఁ దెచ్చి పెంపుడుకుక్కలవలెఁ జేయుఁడు" మని పలికి వారు తెచ్చినమృగముల నామెయొద్ద కీడ్చుకొని వచ్చుచుందురు. ఒక్కొక్క సమయంబున నాసీత యాకుమారుల చర్యలఁ జూచి, తనమనంబున "కుమారోదయభాగ్య మంది నే నీవాల్మీకాశ్రమమున నుంటి నని రామునకుఁ దెలియునా? తెలిసియున్నచో నన్నేల పురికిఁ దోడ్కొనిపోవక యుండును? అయ్యో! ఇది యేమియూహా! లోకాపవాదముఁ బాపుకొనుటకుఁగదా యాతఁడు నన్నుఁ బరిత్యజించినాఁడు. అట్టిచో నాకు మరల జీవితేశ్వరుని దర్శనభాగ్యము లభించునా! ఈసుపుత్రోదయముఁ గాంచి కౌసల్యామహాదేవి యెంత యానందించియుండునో! భరతాదు లెంత సంతోషము పొందుదురో? ఉభయకులవర్ధను లగుపుత్రులఁ గాంచి నాతండ్రియగు జనకుఁడెంత సంబరము నొందునో! రఘుకులనిస్తారకు లగువీరిజన్మమహోత్సవ మెంత వైభవముగా జరిగియుండునో" యని పరిపరివిధములఁ దలచుచుండును.

కుశలవుల కొంచెము బుద్ధి తెలిసినవా రగుటచేత వారప్పుడప్పుడు తల్లిం జేరి "మాతండ్రి యెవ్వరు? ఎచ్చట నున్నాఁ" డని యడుగుచుందురు. వార ట్లడిగినప్పుడెల్ల జానకి కన్నీరు గార్చుచుఁ దనదుఃఖమును బయలుపఱచక యేవో మాటలచే వారిని మఱపించి, వారివలన రామాయణకావ్యగానము వినుచుండును.

## —♦ యజ్ఞాశ్వము ♦—

కుశలవులు సంపూర్ణశాస్త్రశస్త్రవిద్యాధురంధరులై విరాజిల్లుచుండిరి. వారి సాహసకార్యములకుఁ దాపసజనులును, సీతయుఁ గూడ మిగుల భయమందుచు వారిం గను వచ్చిరి. కాని, పుష్పము ద్భవమైనతోడనే పరిమళం బబ్బినట్లు నిరుపమానమైన క్షత్రియశౌర్యము దాఁగునా?

బ్రహ్మలోకమున జరుగు దీర్ఘతరసత్రయాగమునకు వాల్మీకిమహర్షి యరుగఁదలఁచి కుమారసహితయై యున్నసీత కడ కాతఁడు వచ్చి "కుమారీ! బ్రహ్మలోకమున నొకగొప్ప యాగము జరుగుచున్నది. దానిం జూచుటకు నే నాహ్వానింపఁ బడినాఁడ. పోవక తప్ప దయ్యెను. అతిథ్యభ్యాగతపూజలఁ గూర్చి తపస్వినీజనంబులకుఁ జెప్పియున్నాను. సకలముఁ దెలిసిననీవును వారిసి దగినవిధమున నడపుచుండుము. నేను సత్వరముగనే మరలివత్తు" నని పలికి, యామెప్రక్క నున్నకుశలవులఁ గాంచి "కుమారులారా! దుడుకుపనులును, సాహసకార్యములును సేయక, నేను వచ్చువఱకును, రామాయణపాఠములఁ జదువుకొనుచు, నాశ్రమమునకు నేవిధమైన భయము గలుగకుండఁ గాపాడుచుండుఁడు" అని చెప్పెను. "మే ముండఁగా నాశ్రమమునకు భయమా? కుశలవులు ధనుర్ధరులై

యున్నంతవఱకు మనయాశ్రమమును దేవతలైనను దేరిచూడఁజాలరని కుశలవులు వాల్మీకికి నవ్వువచ్చునట్లు పలికిరి. తరువాత వాల్మీకి బ్రహ్మలోకమున కరిగెను.

వాల్మీకి యాశ్రమమున లేఁడుకదా యని లవుఁడు తనవెంట నొక మునికుమారుఁడు రా, నరణ్యమధ్యమునకు దుష్టమృగములఁ బట్టుటకుఁ బోయెను. మునికుమారుఁ డాప్రదేశమునకుఁ బోవలదని చెప్పినను లవుఁడు వినలేదు. లవుఁడరణ్యమధ్యమునకుఁ బోయి క్రూరమృగములకై వెదకులాడుచుండ, దూరమునుండి యాతనికేదియో యొక గొప్పధ్వని వినవచ్చెను. అది యేమై యుండు నని పరికించుచుండఁగా నొకసైన్యము వచ్చుచుండుట యాతనికి గోచరమయ్యెను. అంతలో [1] రామునిచే విడువబడినయజ్ఞాశ్వము ముందు వచ్చెను. దానిని సమీపింపవలదని మిత్రుఁడు వారించుచున్నను, వినక లవుఁ డాయశ్వమును బట్టుకొని, దానినుదుట గట్టబడిన బిరుదు పట్టమును జదివి, తనహితుని విలోకించి "చూచితివా! ఇయ్యది రాముని యజ్ఞాశ్వమట. వీరులయినవారు దీనిని బంధింపవచ్చునట. నరేనేను వీరుఁడను గావున బంధించెదను" నని చెప్పి తనయుత్తరీయముచేఁ దానిని బంధించి తీసికొనిపోయి యొక వృక్షమునకుఁ గట్టివైచెను. అంతట శత్రుఘ్నుని సైన్యము

---

1. శ్రీరాముఁ డశ్వమేధయాగము సేయ దీక్షఁ బూని తురంగము భూతల మంతయుఁ జరించిరా విడచెను.

వచ్చి యశ్వము బంధింపబడియున్న ప్రదేశమునకుఁ గొంతదూరములో నిలిచియుండెను. అశ్వము బంధింపబడి యుండుటఁ జూచి, శత్రుఘ్నుని సేనానాయకుఁడు వచ్చి లవునిఁ జూచి, "ఈయశ్వమును బంధించినవాఁడెవఁడు? నీవేనా! అట్లయినఁ దాపసకుమారుఁడవగు నీకు దీనితోనేమి పనియున్నది? విడువు" మని పలికెను. ఆపలుకులకు లవుఁడు "ఓయీ! బంధించిన యశ్వమును నే నెట్లు విడుతును. వీరులుండినఁ బట్టుఁడని దీనియళికభాగమునఁ గట్టఁబడిన బిరుదుపట్టముఁ జూచి, నేను వీరుఁడనగుటచేతనే పట్టితి" నని భీకరముగాఁ బలికెను. వీరిరువురు సంభాషించుచుండగా నయ్యెడకు శత్రుఘ్నుం డరుదెంచి క్రతుతురంగమును విడువు మని లవునకుఁ జెప్పెను. అతఁడు శత్రుఘ్నుని జూచి "రాజా! అఖండపరాక్రమ ముండుటచేతనే నే నీయజ్ఞాశ్వమును బంధించితిని. రుద్రుఁడు వచ్చినను నేను దీనిని విడువను. నీవు సౌర్యము గలవాఁడవేని విడిపించుకొనుము." అని ప్రత్యుత్తర మిచ్చెను.

లవునివేషము మునికుమారభ్రమ నొదలించెను. ముఖలక్షణములు వాక్చాతుర్యము క్షత్రియబాలునకు వలె నుండెను. అట్టివానితోఁ బోరుట కిష్టము లేక శత్రుఘ్నుఁ డిట్లు పలికెను. "మునిబాలకా! తాపసకుటీరములందు వైదిక విద్యల నభ్యసించు మీకు క్షత్రియులతోఁ గలహమేల? యుద్ధ

మనిన నేమనుకొంటివి? అందు మిగుల భయముగలిగించునంధే భములేగాని, గంతులువైచు హరిణములు గావు. అగ్నికీలలఁ జిమ్ముశోగములే కాని, పరమేశ్వరు నర్చించుపుష్పములుగావు. వ్యాఘ్రాగ్రేసరుల భయంకరసింహనాదములే కాని, వేదఘోషణము కాదు. నీవేమి, మాతోఁ బోరుసలుపు టేమి? నీవు బాలుఁడ వగుటచే నట్లు పలుకుచుంటివి. నీచిన్నతనపుమాటల విడువుము. ఈయశ్వమును నీవు తెలియక బంధించితివి. దీనిని విడిచిపుచ్చి నాతోఁ బురంబునకు రమ్ము. నీ కశ్వము గావలసినచో మఱియొకదాని నిచ్చెద. నిన్నుఁ జూచిన నాకు ముద్దు వచ్చుచున్నది నీవునాతో నరుదెంచితివేని మహారాజేంద్రుడు సేయుచున్న యజ్ఞమహోత్సవముఁ జూడవచ్చును. యజ్ఞదినము లన్నియు నీ వచ్చటనే యుండి మధురసాన్నభక్ష్యభోజ్యంబులఁగుడువవచ్చును. ఇదియుంగాక నీకు రత్నహారములు గాని, వస్త్రములుగాని, భూములు గాని యొసంగెదను." అని పలికినమాటలకు లవుఁడు "నీవు దాతవు గాన నిచ్చెదవు. నీ దానమును స్వీకరించుటకిచ్చుట నవ్వాడను సిద్ధముగ లేను. లంచ మిచ్చి హయమును గొనిపోవుట నీవంటి యుత్తమక్షత్రియునకుఁ దగదు. కావున నీమాటలు చాలించి చేతనైనచో యుద్ధము సేయుము. లేదేని వచ్చిన దారిని బొమ్ము" అని నిశ్చయముగఁ బ్రత్యుత్తర

మిచ్చి, రణమునకు సంసిద్ధుఁ డయ్యెను. శత్రుఘ్నుఁడు తొలు త సందేహించుచుఁ బోఁప సలిపెనుగాని, లవునియస్త్రసంధాన చాతుర్యముఁ గాంచి, తీవ్ర మైనపోరాటమునకుఁ గడంగి యా లవుని మూర్ఛిల్లఁ జేసి రథముపైఁ బెట్టుకొని, యశ్వమును విడి పించుకొని పోవుచుండెను.

ఆశ్రమమున లవుఁ డింకను రాలే దని విచారించుచు సీత యొంటరిగా నుండెను. ఆసమయమున మునిబాలు, డగిరి లవునివృత్తాంతము దెలిపెను. ఆవృత్తాంతము విన్నంతనే యా మె మూర్ఛిల్లి లేచి, "హా! నందనా! పావకజ్వాలలచందమున హృదయమును దహించివైచుచున్న పతినిరాకరణమునకుఁ దో డు, నాకుఁ బుత్రవియోగముఁగూడఁ దటస్థించినదా! అక్కటా! నే నెట్లు దీనిని భరింతును. అరణ్యమున నున్న మన కామఖవా జితో నేమిపని వచ్చినది. పూర్ణేందుమండలమును ధిక్కరించు నీముఖపద్మమును జూచిన నెట్టివారైనను ముద్దువెట్టుకొందురే అట్టియెడల నీపై దారుణశరప్రయోగము సేయుట కారాజేం దుఁడిన కెట్లు చిత్తము సమ్మతించెను? పురాకృతకర్మఫలమున భర్తచేఁ బరిత్యజింపఁబడి, యరణ్యమున నున్నను గుమారు లగు మిమ్ముఁ జూచుకొనుచు దుఃఖము దిగమ్రింగి యుంటిని. కుమారా! లవా! నీముద్దుముచ్చటలు నెట్లు మఱతును. ఒక్క నివిఁ షమైనను విడువఁజాలనినీయన్న నెట్లు విడిచితివి? నీతండ్రి

చేయుగారాబముఁ జూపవైతివి. అవ్వలకు నీముద్దుముచ్చటలఁ జూపవైతివి. తనయనంతరము మిథిలానగరరాజ్యలక్ష్మికి సీతాసంతానమే యాధిపత్యము వహించు నని సంతోషముతో నుండుమీతాత యగుజనకరాజఋషి మొగ మైనఁ జూడలేదు. తండ్రీ! ఇంతలోనే నీకు నూరేండ్లు నిండెనా! దుర్భరం బైన యీశోకము నెట్లు భరింతును? నేను మిమ్ములఁ గంటి నని రామచంద్రునకుఁ దెలియకపోదనియుఁ గుమారసహిత నగున న్నెట్లో నగరమునకుఁ దోడ్కొనిపోవక మానఁడనియు గంపంత యాసతో నుంటిని. అట్టినాయాశ యంతయు వ్యర్థము చేసితివా!'' యని పరిపరివిధముల విలపించుచుండెను. అప్పుడే యచ్చటికో యరిగినకుశుఁడు వచ్చి తల్లిదుఃఖకారణం బెఱింగి యాతఁడుఁ గూడ విచార మంది క్రమ్మఱ ధైర్యముఁ దెచ్చుకొని తల్లిని విలోకించి "అమ్మా! నీవు విచార మందవలదు. ఈకుశుని శౌర్యాటోపవిజృంభణమును, నస్త్రవిద్యాపాటవమును, బరీక్షింపఁ దలఁచి, యానృపాలుఁడు లవునట్లు చేసినాఁడు. నీవు ధైర్యమున నుండుము. లవున కావంతయు నాపద సంభవింపదు. నేఁడు సూర్యుం డపరాద్రికిఁ జేరకమున్నే లవుని మూర్ఛవుచ్చినయానృపాలునిఁ దునిమి, మనలవునిఁ దెచ్చెద. నీకు ముదము గూర్చెద" నని పలికెను. అప్పలుకులకు సీత భయం బంది "నాయనా! సాహసము వలదు. ఎందు కీయుద్ధ

ము. నన్ను మఱింతదుఃసాగరమున ముంచెదవా? నాకన్నుల యెదుట నుండు” మనెను. “అమ్మా! నన్నుఁగూర్చి భయ మందవలదు. మూఁడవకన్నుఁ దెరచి, చేతఁ ద్రిశూలముఁ దాల్చి, రుద్రుఁడు వచ్చినను సంగరంబున వెనుదీయక, యన్వి తీయశౌర్యాటోపమునఁ బోరాడి, విరోధిశిరముఁ దెచ్చి నీ కచ్చనకాయలాట కిచ్చెద. నన్నాశీర్వదించి పంపు” మనిపలి కిన గుశునిఁ గాంచి, యాసాధ్వి యగుసీత, యాతని నాశీర్వ దించి పంపెను.

మూర్ఛ మునింగిన లవుని రథముపైఁ బెట్టుకొనిశత్రు ఘ్నుఁడు పోవుచుండెను. “ఓయీ! రాజా! నీవరాక్రమమున కు లోకము పరిహాసించు ననియైనఁ దలంపవైతివే! పిచ్చుకపై బ్రహ్మాస్త్ర మన్నట్లు కన్నుదెఱవనిపసికూనపై దారుణాస్త్ర ము ప్రయోగించి మూర్ఛ పుచ్చి, రథముపై బెట్టుకొని పోవు చుంటివా? ఆహా! ఎంత శౌర్యశాలివి! ఎంత పరాక్రమవంతుఁ డవు! ఇదిగో నీ బాలికిఁ గాఁబుఁడనై వచ్చినవాన్నుఁ జూడుము సిన్నుఁకి నొకయుద్ధగైన నాపలకుఁ బోసియు” నని పలుకుచుఁ గుశుఁడు వచ్చి రథమున కడ్డముగా నిలిచెను.

“ఈబాలుఁ డెవఁడు? తాపశాస్త్రములయం దుండు వీరి కిట్టిశౌర్య మెట్లావడెనోకదా! ముఖవైఖరిఁ జూడ మూ ర్ఛ నందిన బాలున కగ్రజునివలె నున్నాఁడు. ఏకారణముచేతనో

వీరిం గాంచినచో నా కనురాగము కలుగుచున్నది. వీరిముఖలక్షణ
ములు నాకు సీతామహాదేవిని స్మరణకుఁ దెచ్చుచున్నవి. నిం
దానివారణార్థము కాంతారమధ్యమున విడువఁబడిన సీతామహా
దేవి యీపుత్రద్వయమును గనియుండునా? ఇప్పుడు నే నేమి
సేయుదును ఈబాలవీరుఁడు రథము గదలకుండ నిలుపుచు
న్నాఁడు" అని మనంబునఁ దలఁచి, యాశత్రుఘ్నుఁడు కుశునిఁ
గాంచి "తాపసబాలకా! నీవు నారథము నిలువరించితివేల?
నీవు నాతో యుద్ధము సేయఁదలఁచితివా యేమి? అట్టియుద్దేశ
మున్నచో నీతమ్మునిస్థితిఁ దలఁచుకొమ్ము" అని నుడివెను.
ఆమాటలకుఁ గుశుఁడు దండతాడితమహోరగము చందమున
మండిపడుచుఁ "దాపసబాలకుఁ డని నన్నుఁ దలంపకుము.
వట్టిగొడ్డున కఱపు లెక్కువయను నట్లుల యీలీలఁ బ్రగల్భము
లాడెదవు? చేతనైనచో యుద్ధము సేయుము. లేదేని నన్ను
శరణుఁ బొందుము. రక్షించెద" నని నిర్భయముగాఁ బలికెను.
ఇంతలో రథముపై మూర్ఛ నందియున్న లవుఁడు లేచి, రథము
నుండి లంఘించి, కుశునిఁ జూచి మహానందమును బొందెను.
ఇరువురును నశ్వినీకుమారులవలెఁ దేజరిల్లుచు శత్రుఘ్నునిఁ
దాఁకిరి. వారివారిశరలాఘవమునకును గరలాఘవమునకును,
శత్రుఘ్నుఁ డద్భుత మంది యతితీవ్రముగఁ బోరుసలిపెనుగాని
తుదకుఁ గుశునిబాణముచే నేఁబడి మూర్ఛిల్లెను. అంతఁ గుశ

లవులు మఖాశ్వమును బంధించుకొనిపోయి, పూర్వపుప్రదేశ మునఁ గట్టివైచి తమవిజయమును దల్లి కెఱింగించుటకొఱకు మునిబాలునిఁ బంపిరి. మూర్ఛిల్లిన లవుఁడు వచ్చినందులకును గుమారులవిజయమునకును నామె మహానందము నందెను.

శత్రుఘ్నుఁడు రణమునఁ దాపసకుమారులచే మూర్ఛ నందె ననియు, యజ్ఞాశ్వము వారిచే బంధింపఁబడిన దనియుఁ జారు లరిగి రామున కెఱింగించిరి. రాముఁడు మిగుల విచారించి లక్ష్మణునిఁ బంపెను. బలసమేతుఁడై లక్ష్మణుఁ డరుదెంచి, "ఏమి కారణమో కాని, లోకైకసాధ్వియు, రామమయజీవితయు, నగుసీతామహాదేవి సాకేతనగరముఁ బాసినది మొదలు మాకుఁ గష్టములమీఁదఁ గష్టములు వచ్చుచున్నవి. ఆసాధ్వీమణి యిప్పు డెచ్చట నున్నదో? ఏతాపసోత్తమున కామహాదేవి నాదరించుభాగ్యము లభించినదో! నే నీజన్మమున నాభువనమాతను సేవించుభాగ్యము గందునా!" యని తలఁచుచు, నశ్వము బంధింపఁబడినవృక్షమును సమీపించి యచ్చట నున్న కుశలవులఁ గాంచెను. లవుఁ డాతనిఁ గాంచి "ఏమి! దొంగవలె వచ్చుచుంటివి? కన్నుచాటుగ నున్నచో నశ్వమును దీసికొని పోవఁదలఁచితివా?" యని పలికెను. ఆమాటలకు లక్ష్మణునకు నవ్వును గోపము ననురాగము వారిపై నొకసారిగఁ గలిగెను. ఆతఁడు వారిం గాంచి యిట్లు పలికెను. "బాలకులారా! మీ

చిన్నతనపుమాటల విడిచి యిల్లు విడుఁడు. మీరు మునికుమా
రులు; మేము రాజులము. మీరు మాకనవసరముగ నాగ్రహ
మొనవు కార్యము చేసినారు. మీ రీయజ్ఞాశ్వము విడువుఁడు.
సౌందర్యమునందు మీరు కంతుజయంతులఁ బోలియున్నారు.
మీతో రణ మొనర్చి మిమ్ము మ్రందించుటకు నాకుఁ జేతులా
డవు. నాపరాక్రమమును గూర్చి మీ రెఱుంగరు. మున్ను
రణమున రావణునిపుత్రుఁ డగు నింద్రజిత్తును గూల్చినాఁడ."

అప్పలుకులు విని కుశుఁడు ధనువు ధరించినయట్టి వారి
తో యుద్ధము సేయుట కే మేమిచ్చట నశ్వము నుబంధించితిమి
పురహరుఁడు వచ్చినను భయముండదు. ఇంద్రజిత్తును గూల్చి
నవాఁడ నని నీవు చెప్పుకొనుచున్నందులకు నవ్వువచ్చుచున్న
ది. నీపరాక్రమప్రకటన మింకఁ జాలింపుము. ఈసంగతి మా
కిదివఱకే తెలియును. అతనిఁ జంపుటకు నీవు పడినకష్టమెఱుం
గుదుము. ఆతఁడు నిన్నే డాటలాడించ లేదా! తుదకు నీవు
"నాయగ్రజుఁ డగు రాముఁడు సత్యసంధుఁడగునేని యీశర
ము నిన్నుఁ గూల్చుఁగాక యని యారక్కసునిపైఁ బ్రయో
గించినావు. ఇందు నీప్రయోజకత్వ మేమున్నది? ఈగౌరవము
రామునకే కదా" యని నిర్లక్ష్యముగాఁ జూచుచుఁ బలికెను.
లక్ష్మణుఁడు క్రోధరసపూరితచిత్తుఁడై రణమునకుఁ దలపడెను.
కొంతసేపు యుద్ధము జరిగినపిదప సౌమిత్రికిఁ గుశలవు

పరాక్రమము పూర్తిగాఁ దెలిసెను. లక్ష్మణునిచేఁ బ్రయోగింపఁబడుచున్న శరములన్నియుఁ గుశలవులచే ఖండింపఁబడుచుండెను. తుదకు మహాపరాక్రమైకధనుఁడగు లక్ష్మణుఁడు తన శౌర్యము సన్నగిల్లి కుశలవుల బాణప్రహారములచే మూర్ఛనందెను.

లక్ష్మణునివార్త రామునకుఁ దెలిసెను. అంతటనాతఁడును, భరతుఁడును నాంజనేయాదులును బయలుదేరి వచ్చిరి. భరతుఁడు గూడఁ గుశలవులఁ దాఁగి శత్రుఘ్నుని మార్గము ననుసరించెను. తమ్ములస్థితిఁ గాంచి, రాముఁడు మహాదుఃఖసాగరమున మునింగెను. ఆతఁడు తనమనంబున "అక్కటా! పుండుపైఁ బుల్లయున్నట్లు జానకియెడఁబాటునకు దుఃఖించుచు వసిష్ఠమునిప్రబోధితుఁడనై యశ్వమేధయాగదీక్షాబద్ధుఁడనైతిని. దీనిమూలమున నాతమ్ములఁ గోల్పోయితిని. పరమసాధ్వీమణిని, నమూల్యసద్గుణమణిని, నా సేవతప్ప నితరమెఱుంగని సాధుశీలను, బరిపూర్ణగర్భవతిని నరణ్యములకుఁ బంపిన పాపము నన్ను బాధింపక విడుచునా? ఆ సుచారిత్రి కంటనుండి వెలువడు నొక్కొక్క బాష్పబిందువున కొక్కొక్క కష్టము గలుగకయుండునా? అక్కటా నాజీవితము వ్యర్థమైపోయినది. హా! తమ్ములారా! నా మూలముననేగదా మీకిట్టిపాటు సంభవించినది? లక్ష్మణా! భ్రాతృవత్సలా! నీవంటి



ఆతడు.................................................చెప్పెను.

సౌర్యశాలినిగూడ మునికుమారులపాట్టకిఁ బెట్టితిని. అతికాయుని వధించిన నీసౌర్య మేపంచకుఁ జేరినది? కుంభనికుంభాది ప్రముఖ్యడిరక్కసుల నుక్కడగించినవిక్రమ మేనీటఁ గలసినది? మేఘనాదునిదుర్వారగర్వం బడంచి కాలునివీటి కంపినయస్త్ర విద్యాధురంధరత్వ మేమూల డాఁగినది! సౌమిత్రీ నేను నిన్నెట్లు మఱవఁగలను. నన్నుఁ బాయఁజాలక యరణ్యములకు నావెంట వచ్చినావు. నిద్రాహారములు మాని, పదునాల్గుసంవత్సరములు నాకు సేవలు చేసినావు. నాకష్టసుఖములే నీకష్టసుఖములుగ భావించినావు. నిరంతరము నాయాజ్ఞ శిరమున ధరించి మెలంగినావు." అని చింతించుచు నెమ్మదిగా నశ్వము బంధింపఁబడియున్నవృక్షమును సమీపించెను. అచ్చటఁ గుశలవు లుండిరి. వారు రాముని జూచి యద్భుత మందిరి. ఆతనిం జూడఁగనే వారి కొకవిధమైన సంతోషమును ప్రేమయుఁ గలిగెను. రాముఁడు వారిం జేరి, తద్రూపములు, మోములు కమనీయదేహకాంతులు చూచినయంతనే యతని కన్నులయెదుట సీతాప్రతిరూపము చిత్రింపఁబడినట్లుఁ గన్పట్టెను. ఆతఁడు నెమ్మదిగా వారిం బల్కరించి యజ్ఞాశ్వమును విడువుఁ డని చెప్పెను. కుశలవు లనేకవిధము లయిన చమత్కారవచనములతోఁ బ్రత్యుత్తరము లిచ్చిరి. రామునకు నవ్వు వచ్చుచుండెను. ఆకుమారులతో యుద్ధము సేయుట కతని చిత్తము సమ్మతించుటలేదు. ఆతఁడు వారిని విలోకించి "కుమారులారా! మీ సాహసచర్యలు నా కత్యద్భుతముఁ గొలుపుచున్నవి. మీరు తాపసపుత్రులు. వనంబునఁ దపోవృత్తి నుండువారలు.

అట్టిమాకు మాతో విరోధ మేల? బ్రాహ్మణులకు యుద్ధ ముతో నేమిపని యున్నది? అది క్షత్రియులకే విధింపఁబడి యున్నది. కావున నామాటలు వినుఁడు. మీకు రత్నహార ములుగాని, కుంజరములుగాని, పీతాంబరములుగాని, హారులు గాని, యిచ్చెదను. ఇంతయేల సాకేతనగర రాజ్యమున నర్ధభాగ మిమ్మన్న నిచ్చెద. క్రతుహయమును విడువుఁడు." అని పలికి తాను రాముం డగుట నెఱింగించెను. అందులకుఁ గుశలవులిట్లు పలికిరి. "మహారాజా! నీవు చక్రవర్తివి. నిరంకుశశాసనుండవు. నీయాజ్ఞ కాదనువా రెవ్వరు? నీ విచ్చుదానమున కడ్డము గలి గించువా రెవరును లేరు రాజ్యమం దర్ధభాగ మంటివి. అట్టి యపేక్ష మా కిప్పుడు లేదు. ముందుమాట యెట్లుండునో చెప్పఁజాలము. శుభప్రదములైన రుద్రాక్షలుండఁగా, మాకు రత్నహారము లేల? నారచీర లుండఁగాఁ బీతాంబరము లేల? పర్ణశాల లుండఁగా మణిమయమందిరము లేల? వన్యఫలము లుండఁగా షడ్రసాన్నపాయసభోజన మేల? వనమృగబల ముండఁగా గరిరథాశ్వబల మేల? సంతతపరమేశచింతనాసక్తుల మగుమాకు భూపరిపాలనాసక్తి యేల? ఓ మహారాజా! ఆవిషయము లట్లుంచుము. కరంబుల ఖడ్గంబులను, బాణంబు లను, ధరించి పరాక్రమశౌర్యములే ధనముగా భావించుమాకు వీనితో నేమిపని యున్నది? మావంటివారు చేత ఖడ్గము ధరిం చుట యలంకారార్థము కాదు. యుద్ధభూమియే శూరులకుఁ గ్రీడాప్రదేశము. అదియే యిహపరలోకములలో వీరునకుఁ గీర్తిదెచ్చునది. అదియే సకలసౌభాగ్యప్రదము. అదియే ధర్మ సంరక్షణార్థమై వీరులు రక్తమును శరీరములనుండి స్రవింపఁ

జేయుస్థలము. ఇఁక నొకమాట వినుము. చక్రవర్తి వగుటచేత నీయాసతిఁ దీర్చుటకన్న మఱియొకకార్యము లేదు. కాని కీర్తి గాంచుటకు మే మీయజ్ఞాశ్వమును బట్టితిమి. అట్టిదానిని మేము మరల విడువఁజాలము. దేవా! రామచంద్రా! అర్క కులవారాశిచంద్రా! భవదీయదివ్యమంగళవిగ్రహసందర్శనమున మేము ధన్యులమైతిమి. సముద్రబంధనసమయమున నిన్ను సేవించుచు వెంట నరుదెంచిన కపులకన్న నెక్కుడు ప్రేమతో నుడుతను లాలించినావు. పరమనిష్ఠాగరిష్ఠులై తపం బొనర్చిన మునీంద్రులతోఁ దుల్యుఁడగునట్లుచేసి యక్షీణకరుణాకటాక్షమునఁ బక్షినాథునకు మోక్ష మిచ్చినావు. రావణవధానంతరమున నయోధ్యకు మరలివచ్చుచు భరతునికన్న ముందుగాఁ గిరాతనాయకుం డగు గుహునిసేమ మరయ హనుమంతునిఁ బంపినావు. భరద్వాజమునీంద్రుని సత్కారంబును శబరియిచ్చిన పండ్లును నొకతీరుగ భావించినావు. నీవు సార్వభౌమానాయకుండవు కాని కేవలము మానవుఁడవు గావు ధరాభారనివారణార్థము సూర్యకులమున రామరూపమున నవతరించితివి."

భావగంభీరత, చమత్కారము. భక్తి, వినయము, వీరరసముగలిగి వెలుగొందుచున్న యాకుమారశేఖరులవాక్యములకు రాముఁడు మిగుల సంతసించెను. ఆమాట లాతని రణపరాఙ్ముఖునిఁగాఁ జేయుచుండెను. కాని వారు మాటలతో హయమును విడుచుట లేదు. అందుచే నాతఁడు తనవీరచరిత్రము కొంత వారికి వినిపించెను. దానిపై లవుఁడు రామునిఁ గాంచి "నీచరిత్రము మాకుఁ జెప్పనక్కఱలేదు. నిన్ను మేము చూడలే దనుమాటయే కాని నీకల్యాణవైభవముఁ

గన్నులారఁ దిలకించినాము. తిలకించుటయే కాదు. పెండ్లిభోజ
నముఁ గూడఁ జేసినాము. నీమీఁద భక్తిసిలుపుటయేకాక, జన
కాజ్ఞఁ బాలింప నటవి కేగుటనీవెంట వచ్చినాము. నీసతీవియో
గము చూచుటయేకాక హృదయములు పగుల నేడ్చినాము.
కపులతోఁ జెల్మి వాటించుటయేకాక సేతువుఁ గట్టినాము.
వార్ధి దాఁటినాము. లంకలోఁ జొచ్చినాము. రక్కసులతోఁ
బోరాటఁ జూచినాము. రావణవధఁ గాంచినాము. సీతాపాతి
వ్రత్యపరీక్షఁ జూచినాము. సంతోష మందినాము. ఇఁక నేమి
కావలయు" నని పలికెను. అక్కుమారుని పలుకులకు
రాముఁడు వెఱఁగంది "యిదియంతయు మీరెచ్చటఁ జూచితి"
రని ప్రశ్నింప, వారు "వాల్మీకివ్రాసినకావ్యమున" నని బదులు
చెప్పిరి. రాముఁడు నవ్వెను. మఱికొంతసేపటి కానవ్వు క్రోధ
ముగా మార్చుకొని, యశ్వమును విడువకయున్నచో వారి
కపాయము వాటిల్లునని భయపెట్టెను. అందులకుఁ గుశలవు
లిట్లనిరి. "నీవు సాక్షాద్విష్ణుఁడవు. నిన్ను గెలిచినచో మేము
త్రిలోకఖ్యాతిఁ బొందుదుము. లేక నీహస్తమునఁ జచ్చితిమేని
మోక్షలక్ష్మిం బొందుదుము. కావున మమ్ము భయపెట్ట
వలదు." అంతకంతకు వారి సంభాషణములు వీరరసముతోఁ
గూడుకొని, క్రమక్రమముగా సమరాభిముఖుఁ జేసినవి.
రాముఁడు బాలురపైఁ బ్రయోగించినశరములు వారికిఁ బుష్ప
హారములై యొప్పెను. రాముఁ డాశ్చర్యమంది నారాయణా
స్త్రము సంధించి విడిచెను. కుశలవు లయ్యస్త్రమునకుఁ గొంత
భయ మంది మరల ధైర్యమువహించి యొకయమోఘశరముఁ
బూని "మాతల్లి పరమసాధ్వి యయ్యెనేని యీభూపాలుఁడు

మూర్ఛ మునుంగుఁగాక" యని విడిచిరి. ఆయస్త్రము సోఁకి నంతనే రాముఁడు మూర్ఛిల్లిపడియె. వెంటనే కుశుఁడు రాముని కరాంగుళీయకమును గైకొనెను.

అప్పు డచ్చటి కాంజనేయుఁడు వచ్చి, బాలురం దాఁకెను. బాలురు వానిని దమయస్త్రమున బంధించి నిజాశ్రమమునకుఁ గొనిపోయిరి.

యజ్ఞాశ్వమును బంధించినకుమారు లేమయిరో, యెవరితోఁ బోరాటము సంభవించినదో యని వారికై పరితాపమందుచు నాశ్రమమున సీత యుండెను. అంతట బంధింపబడిన హనుమంతునితోఁ గుశలవు లాశ్రమమును జేరి ద్వారమునొద్ద హనుమంతుని గట్టి వైచి, వారు లోనికిఁబోయి తమకై యెదురు చూచుచున్న తల్లికి నమస్కరించి యిట్లు చెప్పిరి. "అమ్మా! మాతోఁ బోరినక్షత్రియులు లోకాతీతపరాక్రమోపేతులని చెప్పుటకు సందియము లేదు. తుదకు మాతోఁ గయ్యము సేయవచ్చిన మహానుభావుఁడు సాక్షాద్భగవత్స్వరూపుఁడే. ఆతనిం జూచినయంతనే మాకొకవిధమైన యనురాగము భక్తియు నుదయించెను. మొదట నాతఁడు మాపై బాణములఁ బ్రయోగించినాఁడు, అయ్యవిపూలదండలై మాగళములలంకరించినవి. అనంతర మాతఁడు నారాయణాస్త్రముఁ బ్రయోగించెను. మేము నిన్ను స్మరించి బాణమును విడిచి

తిమి. నీస్మరణము మేము చేసినయంతనే యాతఁడుమూర్ఛిల్లి నాఁడు. ఆతనివ్రేలనున్న యుంగరము మేము తెచ్చినా మని పలికి, దాని నామె కిచ్చిరి. సీత, యయ్యంగుళీయకమును జూచి హా! యని నేలఁబడి మూర్ఛిల్లి కొంతసేపటికి లేచి, యాతఁడు వారితండ్రి యగుట యెఱింగించెను. కుశలవులు తాము చేసిన యకార్యమునకువిలపించుచు నాఁకటఁగట్టివైచిన హనుమంతునిఁ గూర్చి చెప్పిరి. సీతయాజ్ఞపై వారు హనుమంతుని బంధవిముక్తునిఁజేసి, యామెసన్నిధికిఁ దోడ్కొని వచ్చిరి.

హనుమంతుఁడు సీతం గాంచి యపరిమితానందమును బొందుచు నమస్కరించెను. సీతయుఁ గుశలవులును రామునిఁ గూర్చి విలపించుచుండఁగా బ్రహ్మలోకమునుండి వాల్మీకి యరుదెంచి సమస్తమును విని, వారిని జింతింపవలదని చెప్పి, రామాదులు పడియున్న ప్రదేశమునకుఁ బోయి, కమండలుజలంబును వారిపైఁ బ్రోక్షించెను. వెంటనే యందఱును లేచిరి. అనంతరము వాల్మీకి కుమారద్వయసహిత యగుసీతను శ్రీరామునిసన్నిధికిఁ దోడ్కొనిపోయి, సీత సౌశీల్యము వర్ణించెను. రాముఁడు కుమారులఁ గౌఁగలించుకొని హర్షాశ్రువుల విడిచెను. పిదప నమ్మహాత్ముఁడు సీతను గ్రహించి కుమారసహితుఁడై దమ్ములు మొదలగువారు వెంటరా నిజనగరమునకేగి యాగమును బూర్తిజేసి కుశలవులకుఁ బట్టాభిషేకముచేసెను.

---

# 4 అభిమన్యుఁడు.



అభిమన్యుఁడు పుడమిపైఁ జీవించియున్నది కొలఁదికాలమే యైనను నాతనిపవిత్రవీరచరిత్రము ప్రతిమానవుఁడు తనహృదయఫలకమున లిఖించుకొనునట్లు చేసినాఁడు. ఈతఁడు పాండవమధ్యముఁడగునర్జునునకుఁ గృష్ణసహోదరి యగుసుభద్రయందు జనించినవాఁడు. పాండవులు మాయజూదమున రాజ్యశ్రీల నెల్లఁ గౌరవుల కోడిపోయి,యరణ్యముల కేగినప్పు డీకుమారుఁడు మేనమామ లగుబలరామకృష్ణులయింటద్వారకానగరమున నుండెను. ఈతఁ డచ్చట ధనుర్విద్య సాంగముగ నభ్యసించెను. మేనమామలయింట నున్నప్పు డీతనిచిత్తము బలరామతనూజ యగుశశిరేఖయందుఁ జిక్కియుండెను. ఆబాలికచిత్తముగూడ నీతనియందే చిక్కియుండెను. దానికిఁ దగినట్లచ్చటివా రెల్లరును శశిరేఖ యభిమన్యునిభార్యయే యని పలుకుచుండెడివారు. ఈవాక్యములకు సుభద్ర యపరిమితానందమును బొందుచుండెడిది. శశిరేఖాభిమన్యుల యనురాగమంతకంతకభివృద్ధిఁ బొందుచుండెను. ఇంతలో దీనికొకభంగ మొదవెను.

హస్తినాపురాధీశ్వరుఁడగు దుర్యోధనుఁడు గదాయుద్ధము నేర్చుకొనుటయందు బలరామునకు శిష్యుఁడు. ఆతఁడు చక్రవర్తియై యుండి, మహాసంపదలతోఁ దులఁదూఁగుచుండెను. ఆతఁడు శశిరేఖను దనకుమారుఁ డగులక్ష్మణునకిమ్మనిబల

రామునకు వార్తఁబంపెను. బలరాముఁడు గొప్పసంబంధ మని తలంచి యందులకు సమ్మతించెను. ఇయ్యది కృష్ణునకుఁ గొం చెమయిన నిష్టము లేదు. ఇందులకు సుభద్ర మిగులఁజింతించి యగ్రజుం డగుబలరామునిఁ జేరి "అన్నయ్యా! అభిమన్యుఁడు నీకుఁ బరుఁడు కాఁడు, మేనల్లుఁడు. నీవు సంపద కాసింపవలదు. విధికృతమునఁ బాండవులు సంపదలకు దూరస్థులై యరణ్యము న నుండిరి. ఇంతవఱకును నేను నీతో వియ్య మందుదు నని సంతోషించుచుంటిని. నాయానందమునకు భంగము గలిగింప వలదు" అని బ్రతిమాలి చెప్పెను. కాని ప్రయోజనము లేకపోయెను. అట్టిదూస వదలుకొను మని బలరాముఁడు సుభద్రకు గట్టిగాఁ జెప్పెను. చెప్పుటయే కాక పెండ్లికిఁ దరలిర మ్మని దుర్యోధనుని కాతఁడు వార్తగూడ బంపెను.

సుభద్రయందులకై దుఃఖనీరధిని మునింగెను. అభి మన్యుఁ డామెవిచారము నెఱింగి "తల్లీ! నీవు దీనికై విచారిం చెద వేల? మనల నిట్లు పరాభవించినవీరిగృహముననుండ నేల? యని పలికి, తల్లిని వెంటఁ బెట్టుకొని, యెవ్వరికిఁ జెప్పకుండ నరణ్యమునకుఁ బోయెను. ఇట్లుపోయి, భీమునకు హిడింబయం దుజనించిన ఘటోత్కచుని యాశ్రమమును బ్రవేశించెను. ఈసం దర్భమునుబట్టి ఘటోత్కచుఁడును నభిమన్యుఁడు నన్నదమ్ములగుదురు. ఇరువురును నొకరి నొకరు దెలిసికొనలేక పోవుటచే నయ్యరణ్యమునఁ గలహించి, తుదకు నారదునిచేఁ వారింపఁ బడి, తమతమవృత్తాంతముల నెఱింగికొనిరి. మాతృసమేతుఁడై యభిమన్యుఁడు వనంబునకు వచ్చినకారణము ఘటోత్కచుం

డెత్తెంగి "తమ్ముఁడా! నీవు ధైర్యమువహించి నాయాశ్రమ మున నుండుము. నేను ద్వారక కరిగి వివాహచిత్రములు చూచి వచ్చెదను. బలరాముఁడు తనతనూజను దుర్యోధ నాత్మజుఁ డగులక్ష్మణున కెట్లిచ్చునో చూచెద" నని పలికి సుభద్రాభిమన్యులను జాగ్రత్తగాఁ జూచుచుండుమని తన తల్లియగు హిడింబకుఁ దెల్పి, యాతఁడు ద్వారక కరిగెను.

దుర్యోధనుడు భీష్మాదివృద్ధులతోడను బంధువులతో డను పెండ్లికై ద్వారకకు వచ్చెను. ఘటోత్కచుఁడు మాయా బలమున శశిరేఖ యున్నసౌధమును బ్రవేశించి, నిద్రించు చున్న యక్కన్నియను దెచ్చి దనయాశ్రమమున సుభద్రాభి మన్యులకడఁ జేర్చి, తాను మరలవచ్చి, శశిరేఖాకృతితోఁదల్ప మునఁ బండియుండెను. వివాహలగ్నము సమీపించెను. చెలి కత్తెలు వచ్చి కైతనశశిరేఖను దోడ్కొనిపోయి పీటపై గూర్చుండబెట్టిరి. పెండ్లికొమరునకు శశిరేఖముఖముఁ జూచిన యంతనే శరీరము కంప మెత్తెను. పెండ్లికూఁతురిఁ జూచి భూత మని వెఱ్ఱికేకలు వేయసాగెను. ఎంతమంది ధైర్యము చెప్పినను వినక చివరకుఁ బెండ్లికొడుకు పీటమీఁదనుండి లేచి పరుగెత్తెను. ఇంతలో మాయాశశిరేఖ మాయమయ్యెను. పెండ్లికివచ్చిన వారినెత్తిపై శిలావర్షము గురియఁ బ్రారంభించెను. ఇంత యేల ద్వారకానగర మెట్లుండవలయునో యట్లుండెను. ఈ

మాయకుఁ గారణ మెవ్వరికిఁ దెలియక రాళ్ళవాన కాఁగక జనులు వీధులవెంటఁ బరుగులెత్తుచుండిరి. ఘటోత్కచుఁడు మింటి కెగసి "ఓయీ ! బలరామా ! మేనల్లుని విడిచి నీత నూజను దుర్యోధనసుతుండగు లక్ష్మణునకొసంగఁ దలంచితివి కదా ! కానిమ్ము, తత్ఫలం బనుభవించెదవు" అని పలుకుచు సుయోధనాదులను ద్వారకయందు నిలువకుండఁ దఱిమెను. శ్రీకృష్ణునకు మాత్రమే యీమాయ తెలియును. అప్పుడు బల రామున కేమియు నుపాయము దోచక వాసుదేవునికడ కరిగి యిదియంతయు నేమని యడిగెను. కృష్ణుఁ డగ్రజునిఁ జూచి "ఇదియంతయు ఘటోత్కచుఁడు సేయుచున్నమాయ. అభి మన్యుఁడు మాతృసహితుఁడై ఘటోత్కచుని యాశ్రమమును జేరెను. ఘటోత్కచుఁ డభిమన్యుని వృత్తాంత మెఱింగి, మన శశిరేఖను మాయాబలమునఁ దనయాశ్రమమునకుఁ జేర్చి తాను శశిరేఖరూపమున మరల నిటకుఁ జేరి, యీమాయ యంతయుఁ జేయుచున్నాఁడు. కావున వేఱొకయాలోచనము నీమనంబునఁ జేర్పక శశిరేఖ నభిమన్యున కిచ్చెదనని యాతనికిఁ దెలుపు"మని చెప్పెను. బలరాముఁడు కృష్ణుఁడు చెప్పినట్లు మింట నిలిచియున్న ఘటోత్కచునకుఁ దెలిపెను. అంతట ఘటోత్కచుఁడు తన యాశ్రమమునకుఁ బోయి శశిరేఖాసుభ ద్రాభిమన్యులను ద్వారకకుఁ దోడ్కొని వచ్చెను. బలరాముఁ

డు శశిరేఖ నభిమన్యున కిచ్చి వివాహము గావించెను. అభిమన్యుఁడు శశిరేఖనేకాక మత్స్యనగరాధీశ్వరుఁడైన విరటుని కూఁతురగు నుత్తరనుగూడ వివాహ మాడెను.

—♦ పద్మవ్యూహము ♦—

పాండవులు కౌరవులతోఁ జేసిన శపథము ననుసరించి పండ్రెండేండ్లువనవాసమును నొక్కయేడజ్ఞాతవాసమును సలిపి వచ్చి, తమయర్ధరాజ్యముఁ దమ కిమ్మని కౌరవుల నడుగుటకుఁ గృష్ణుని రాయబారిగాఁ బంపిరి. కౌరవులు పాండవులకు రాజ్యభాగ మొసంగుటకు సమ్మతింపక పోవుటచేయుద్ధము కలిగినది. ఈయుద్ధములో భీష్ముఁడు పదిదినములు పోరి మరణించినపిదప సేనాపతిగా నభిషిక్తుఁ డగు ద్రోణాచార్యుఁడు "అర్జునుఁడు సమీపమున లేకున్నచో ధర్మరాజును బట్టుకొని వచ్చి నీముందుఁ బెట్టుదు" నని దుర్యోధనునకు వరంబిచ్చెను. అందులకై దుర్యోధనుఁడు సుశర్మ మొదలగు రాజులను బురికొల్పి, యర్జునుని యుద్ధమునకు దూరముగాఁ గొనిపోవునట్లు చేసెను. అప్పుడు ద్రోణాచార్యుఁడు యుధిష్ఠిరునిఁ బట్టుకొనుటకుఁబద్మవ్యూహమును బన్నెను.

ధర్మరాజు పరాక్రమవంతుఁడును, ధైర్యచిత్తుఁడునై యున్నను ద్రోణుఁడు పన్నినపద్మవ్యూహమునకు భయమంది శిబిరమున డాఁగియుండెను. ఈమాట ద్రౌపదికిఁ దెలిసినచో

నవ్వునేమో యని యాతఁడు మౌనము దాల్చి యుండెను. కాని నెమ్మదిగా ద్రౌపది యాతని భయకారణం బెఱింగి "మహారాజా! కర్తవ్య మూహింపక చింతించుచున్నందువలన బ్రయోజన మేమియున్నది? మనయభిమన్యుకుమారుఁ డద్వితీయపరాక్రముఁడు. ద్రోణుని వ్యూహమును భేదింపఁగలడు. ఇకార్యమునకాతనినియోగించిన బాగుగానుండు"నని చెప్పెను.

ఈసంగతి జ్ఞప్తికిఁ దెచ్చినందులకు ధర్మజుఁడు సంతోషించెనుగాని, యభిమన్యునకు మొగ్గరంబునఁ బ్రవేశించుటయే తెలియునుగాని మరల నీవలకు వచ్చువిధము తెలియ దను విషయమునుగూర్చి సంశయించెను. ఇదియుంగాక యర్జునుఁడు సుశర్మాదులపైకి యుద్ధమునకుఁ బోవునప్పుడు కుమారుని నెక్కడకును బంపవలదని కూడ చెప్పియుండెను. తుదకు మఱియొకమార్గ మేమియుఁ దోచకపోవుటచేత నభిమన్యునే పద్మవ్యూహభేదనంబునకు నియోగింప నిశ్చయించి, భీమాదులకీ వృత్తాంతం బెఱింగించెను వారుగూడ నందులకు సమ్మతించిరి. అప్పుడభిమన్యుఁడు శల్యునితో గదాయుద్ధము సేయుచుండెను. ధర్మజునియాజ్ఞననుసరించి సహదేవుఁ డాకుమారుని దోడ్కొని వచ్చెను.

అభిమన్యుఁడు పరాక్రమవంతుఁ డగుటయే కాక, పెద్దలయందు భక్తి, వినయము, ఆశ్రితావనము మొదలగు సద్గు

ణము లన్నియు నాతని యందు మూర్తీభవించియుండెను. అభిమన్యుఁడు ధర్మజునకు నమస్కరించి తన్నుఁ బిలువబంచిన కారణ మెఱిఁగింపఁగోరెను. అభిమన్యునకు ధర్మనందనుఁడు నెమ్మదిగా నిట్లు పలికెను. "వత్సా! సౌభద్రా! నీవు బాలుఁడ వయ్యును యుద్ధమున నిరుపమానశౌర్యముతో విహరించుచుండుటఁ గని మే మెంతయు సంతసించుచున్నాము. నీవు నేఁడు నాయాజ్ఞఁ దప్పక పాలింతు వని శల్యునితోఁ బోరాటము మానిపించి నిన్ను రావించితిని. నేఁడు నీవు నన్ను రక్షింపవలయును. త్రిగర్తులతో యుద్ధము సేయుటకు నీతండ్రి యరిగె నని విని గురుఁడు నన్నుఁ బట్టుటకుఁ బద్మవ్యూహమును బన్నినాఁడు. ఆతఁడు చేసినప్రతిన విడుచువాఁడు కాఁడు. గురుఁడు నేఁడు మిగులఁదర్పించియున్నాఁడు. పద్మవ్యూహమును మేమెవ్వరమును భేదింపఁజాలము. కృష్ణార్జునులు సమీపమున లేకపోయినచో ధర్మజుని బంధించెద నని ద్రోణుఁడు చేసిన ప్రతిజ్ఞకు నీవు భంగ మొనర్చి దుర్యోధనుని కోరికరిత్తసేయువలయును."

భీముఁ డిట్లనెను—"కుమారా! పద్మవ్యూహమును భేదించి మీపెదతండ్రిని రక్షింపఁదగిన సమర్థుఁడవు నీవేకాని మఱియెవ్వరును లేరు. నేనుగదాదండమును బూని రణభూమిఁ బ్రవేశించి శత్రువులశిరములు బ్రద్దలుకొట్టుటయే కాని యెప్పుడును నిట్టివ్యూహములఁ బన్నుటగాని విప్పుటగాని యెఱుం

గను ఏవిధముననైన నీ వామొగ్గరమును జించి కొంచెము దారిఁ జూపించితివేని, మే మందుఁ బ్రవేశించి, రిపులను మర్దించెదము. శాత్రవుల వధించుభారము నేను బూనుదును.

నకులుం డిట్లు వక్కాణించెను. "నాయనా! సౌభద్రా, ఇట్టివ్యూహములనుగూర్చి మే మెఱుంగ మని చెప్పుటకు మిగుల సిగ్గుగ నున్నది. ఇట్టివ్యూహములవిషయము మాకుఁ దెలియ దనియు, నర్జునుఁ డియ్యెడల లేఁ డనియుఁ దలంచియే ద్రోణుఁ డీవ్యూహమును బన్నినాఁడు. కావున నీ వావ్యూహమును భేదించి కుంతికంటెను, గోడ లగుసుభద్రయే వీరమాతయనిపింపుము. ఇదియుంగాక నీయెడల మఱియొకవిశేషమున్నది. మాకంటె నిన్నుఁ ద్రోణుఁడు ప్రేమతోఁ జూచును. యుద్ధమున నాతఁడు నీపైఁ దీవ్రశరప్రయోగము సేయఁడు."

సహదేవుం డిట్లు చెప్పెను "కుమారా! వ్యూహమును భేదించి మాకీర్తి నిలఁబెట్టుము. నీ కావంతయుఁ భయము గలుగకుండ మే మందఱము నీవెంటనుండి రక్షించుచుందుము. ఇంతలో నర్జునుఁడు వచ్చును. పెదతండ్రి యగుధర్మజునియందు భక్తిచేతఁగాని, ద్రోణునిప్రజ్ఞకు భంగ మొనర్పవలయు నను తలంపుచేతఁగాని నీవీకార్యముచేసి మమ్ముఁగాపాడవలయును."

వా రందఱు నీ విధంబునఁ జెప్పినపలుకు లాలించి యాసౌభద్రుఁడు వారిం గాంచి "తండ్రులారా! ఈచిన్న

పనికై నాతో మీరింతగఁ జెప్పవలయునా? అర్జునుని పుత్రుఁ డనై, కృష్ణుని మేనల్లుఁడనై యుండిననేను హస్తంబునఁ గర వాలము ధరించిన దెందులకు ? యుద్ధమునకుఁ గాదా! మీరు నన్నుఁగూర్చి సంశయింపవలదు. ఆఁకలి గొన్నమృగేంద్రము కురంగపంక్తిపైఁ బడువిధమున నే నాకౌరవసేనపైఁ బడి పద్మ వ్యూహమును భేదించెదను. ద్రోణునిప్రతిజ్ఞంగూర్చి మీరు భయమొందనలదు. ఆతఁడు మనల నేమియు చేయఁజాలడు. ఇఁక నాకు మీ రేమియుఁ జెప్పనక్కరలేదు. పద్మవ్యూ హాభేదనంబునకు నాచిత్తము తత్తర పడుచున్నది." అని పలి కెను. అనంతర మభిమన్యుని యాజ్ఞ ననుసరించి సూతుఁడు సమస్తాయుధోపేత మగు రథమును దెచ్చెను. అంత నభిమ న్యుఁడు యుధిష్ఠిరుని యుద్ధమునకుఁ బోవుట కనుజ్ఞ నిమ్మని కోరెను. ధర్మరాజు కుమారుని కౌఁగిలించుకొని "కుమారా! నీతండ్రి యగునర్జునుఁడును, మామ యగుకృష్ణుఁడును నిచ్చట లేరు. నిన్నిప్పుడు ద్రోణునిపైకిఁ బంపుచుంటిమి. ద్రోణుఁడు సామాన్యుఁడు గాఁడు. నీవు సుభద్ర కేకపుత్రుఁడవు. నీభార్య గర్భవతి. జాగ్రత్తగా మెలంగుము. నీకు శుభంబగుఁగాక. పోయి రమ్ము" అని పలికెను. అభిమన్యుఁడు రథం బెక్కి యరిగెను.

అభిమన్యుఁ డరిగినవెంటనే ధర్మరాజు సోదరులఁగాంచి "మనయాజ్ఞ ననుసరించి యభిమన్యుఁడు పద్మవ్యూహమును బ్రవేశింపఁబోవుచున్నాఁడు. పరాక్రమశౌర్యమూర్తు లగుమీరు కూడ నాతని వెంట నరిగి, యాతఁడు మొగ్గరము భంజించిన

వెంటనే, మీరును సందుఁ బ్రవేశించి, వైరివీరులఁ గూర్చి,
కుమారున కావంతయు నపాయము వాడమకుండఁ గాపాడి,
మరల సుభద్ర కప్పగించి మాటఁ దక్కించుఁడు" అని పలి
కెను. భీమనకులసహదేవులుగూడ నభిమన్యునకు సాహాయ్యము
సేయుటకుఁ జనిరి.

అట్లు ధర్మజునిచే ననుజ్ఞాతుఁడై యయభిమన్యుకుమార
వీరకంఠీరవము రణభూమిం బ్రవేశించి రథసారథిం గాంచి
"రథమును ద్వరగాఁ బోనిమ్ము. నేఁటిసంగరమున మహాపరా
క్రమముతోఁ జరింపవలయును. దూసినవిచ్చుకత్తిని శత్రు
సంహారము పూర్తిగ నగువఱకును, మరల నొరలోఁ బెట్టక
నాపరాక్రమశౌర్యంబులు తోడిరాజకుమారుల కాదర్శము
లుగఁ జేసి, సకలదిక్కుల యశోడిండిమము మ్రోఁగించెదఁగాక"
అనిపలుకుచుఁ గురుబలంబులఁ దాఁకి నిజబలంబులఁ గాంచి,
"పాండవయోధులారా, ధనురాచార్యుఁడు ధర్మనందనుని
బంధించుటకై పద్మవ్యూహముఁ బన్నె నని మీరు భయమం
దఁ బనిలేదు. నే నీపద్మవ్యూహమును భేదించుభారముఁ బూ
నివచ్చితిని. ద్రోణుఁడు కాఁడు, స్థాణుఁడు వచ్చి నిలిచినను
వెనుకంజ వేయను. మీరును ధైర్యయుతులై నిలచి, శత్రు
వులఁ దునుమాడుఁడు. జయాపజయములు దైవాధీనములు.
విజయేందిరను మనము గొంటిమేని యశము కలుగును. లేదేని
వీరస్వర్గభాగ్యము లభించును." అని నడచి వీరవిక్రమక్రీడకుఁ
బ్రారంభించెను. ఆహా! ఆయభిమన్యుని పరాక్రమము! శౌర్యము!

ఆ యస్త్రసంధాన చాతుర్యము! చూపఱ కత్యాశ్చర్యము గలిగించుచుండెను. ఒక్కవీరునికైన నాతనియెదుట నిలిచి యుద్ధము సేయుటకు ధైర్యము చాలకయుండెను. సౌభద్రుని వీర విహారము చూచుటకు దేవతలుగూడ విమానచరులై యంతరిక్షమున నిలిచిరి. అభిమన్యుఁడు కర్ణునుదాఁకి "కర్ణా! దుర్యోధనుఁడు నిన్ను రథచోదకవృత్తియందు నియమించుటకు మాఱుగా, సంగరాజుగఁ జేసి, భాగ్యసమన్వితునిగాఁ జేయుటం జేసి, మిగుల గర్వించియున్నావు. నీవు మహాస్త్రవిద్యాధురంధరుఁడవఁట. మాతండ్రిని జయింపఁగఁ సమర్థుఁడ వీవేయని కురురాజు నమ్మియున్నాఁడఁట. ఏదీ! నీపరాక్రమ మొక్కింత చూపు" మని వచించెను. కర్ణునకును నభిమన్యునకును ఘోర యుద్ధము జరిగినది. వీ రిరువురును నతిభయంకరముగఁ బోరిరి. తన ప్రియశిష్యునిసుతుం డగునభిమన్యుని పరాక్రమశౌర్యమునకు ద్రోణాచార్యుఁడు మనఃబున సంతసించుచుండెను. అభిమన్యుని సాహసచర్యలు చూచి "ఔరా! బాలుఁడైనయభిమన్యుఁ డస్త్రసంధానచాతుర్యమునందుఁ దండ్రిని మించియున్నాఁడే. కర్ణునిఁ జంపుదు నని ధనంజయుఁడు చేసిన ప్రతిజ్ఞ నిక్కుమారుఁడే తీర్పునట్లున్న" దని పాండవయోధు లొకరితో నొకరు ముచ్చటించుకొనసాగిరి. కర్ణుఁడు తన శక్తినంతయు వినియోగపఱచి, సౌభద్రునితోఁ బోరి తుదకు నిలువఁజాలక పరువెత్తెను. ఇట్లే దుర్యోధన దుశ్శాసన శకునిశల్యులుగూడ నభిమన్యుని దాఁకి ఘోరముగఁ బోరి నిలువలేకపోయిరి. కురు

బలములు వెన్ను చూపఁ దొడంగెను. అప్పుడు ద్రోణాచార్యుఁడు పరుగిడుచున్న వీరులఁ జూచి "ఓహో! కౌరవయోధులారా! ఒక్క బాలునితో మీరు సమరము సేయఁ జాలక యీ తెఱంగునఁ బరుగిడుచున్నచో లోకము మిమ్ము గేలిసేయదా? అభిమన్యుఁడు వ్యూహమును భేదింపఁ జూచుచున్నాఁడు. మీ రందఱును విచ్చి పాఱిపోనచో నాప్రతిజ్ఞ సెల్లుట యెట్లు? కురునాథునకు మోదము గలుగుట యెట్లు? ఈతనికి మీ రావంతయు భయము నందవలదు." అని పలికెను. కురుబలములు మరల ముందునకువచ్చి పాండవబలములఁ గవిసెను. ద్రోణుఁడు కాలానలతుల్యమైనశిఖంబుల శత్రువులపైకి గప్పఁ దొడంగెను. అంతట నభిమన్యుఁడు కురువీరుల నందఱ నొప్పించి యెదురులేని పరాక్రమమున వచ్చి ద్రోణున కెదురై "తాతా! నీవు మాతండ్రుల కస్త్రగురుండవు. అట్టి నీవు శిష్యవాత్సల్యమును నావలకుఁ ద్రోచిపుచ్చి నేఁడు ధర్మసుతుని బంధించెదనని పద్మవ్యూహమును బన్నితివిగా! కానిమ్ము. మీ మొగ్గరమే మగునో చూచెద" నని పలికి యాతని మార్కొనెను. అభిమన్యుని శౌర్యమునకు ద్రోణుఁడే వెఱగంది, కొంతవఱకుఁ జూచుచు నిలిచి యుండెను. ఊరకొన్నకొలఁది నభిమన్యునిచేఁ బ్రయోగింపఁ బడుచున్న శరములవలన వెలువడుచున్న తీవ్రశరాగ్నిజ్వాలలు కురుసైన్యమును దహించి వేయుచుండెను. అంతట ద్రోణాచార్యుఁడు శిష్యవాత్సల్యము

ను హృదయమునుండి పాఱఁద్రోలి, యభిమన్యునిపై ఘోరా స్త్రములఁ బ్రయోగింప నారంభించెను. ద్రోణునిచేఁ బ్రయోగింపఁబడుచున్న ప్రతియస్త్రము సౌభద్రునిచే ఖండింపఁబడుచుండెను. ఎట్టకేలకు సౌభద్రుఁడు వ్యూహమును భేదించుకొని లోపలఁ బ్రవేశించి, యెక్కడఁ జూచిన నక్కడఁ దానయై వైరిసేనామధ్యమున వీరవిహారము సేయుచుండెను. ఎవ్వరును నాతని సమీపింప శక్తులు గాకయుండిరి. తనశరమున కెదురు లేకుండ నద్వితీయపరాక్రమమునఁ జరించుచున్న యభిమన్యుని గాంచి, దుర్యోధనుఁడు భయం బంది, నెమ్మదిగా ద్రోణునిఁ జేరి "ఆచార్యా! మన మీతెఱఁగున జూచుచు నూరక యున్నచో మనకురుసైన్య మంతయు నీదినముననే కాలునిఁ బ్రోలు సేరును. అభిమన్యునియెదుట మే మెవ్వరమును నిలువఁజాలక యున్నాము. నిన్నుఁగూడఁ గడచి వ్యూహమును భేదించుకొని లోపలఁ బ్రవేశించినాఁ" డని పలికెను.

ఆచార్యుఁడు దుర్యోధనునిఁ జూచి "కౌరవేంద్రా! నేనును నాతనివీరవిక్రమవిహారమున కద్భుత మందుచున్నాఁడ. శరసంధానమం దీతఁ డర్జునుని మించినాఁడు. ఈతనిచేత బాణమున్నంతవఱకు మన మెవ్వరమును గెలువఁజాలము. కావున నొకఁడు సారథిని జంపవలయును. మఱియొకఁడు హయములఁ జంపవలయును. ఇంకొకఁడు రథము నుగ్గు సేయవలయును. వేఱొకఁడు వానిచేత నున్నచాపము ద్రుంపవలయును. ఇట్లు చేసి యందఱము నేకమై యాతనిం దాఁకి వధింపవలయును.

ఇంతకంటె వేఱొకమార్గ మేమియు లేదని నుడివెను. ద్రోణాచార్యుఁడు చెప్పినచందమున, దుర్యోధనకర్ణాదివీరు లందఱును గలసి తన్నుఁ దాఁకినను నక్కుమారుఁ డొక్కింతయు నధైర్యము వహింపక యందరతో ననేకవిధములఁ బోరాడుచుండెను. మొగ్గరంబున నభిమన్యుఁ డిట్లుండెను. మొగ్గరమున కావల నున్న భీమాదులు లోపలికిఁ బ్రవేశింపఁ దలంచుచుండఁ గడురయమున సైంధవుఁడు వచ్చి, వారిని నిలువబెట్టి పోరఁ దొడంగెను. ఆకారణమున నభిమన్యునకు భీమాదులు సాహాయ్యము సేయలేకపోయిరి. భీమాదిమహాయోధులనొక్క సైంధవుఁడు వారించుటకుఁ గారణము కలదు. పూర్వము పాండవులు ద్వైతవనమున నుండఁగా సైంధవుం డరిగి ద్రౌపదివిషయమై యొగ్గు దలంచి వారిచే, బరాభవింపఁబడెను. ఆకారణమున నాతఁడు తప మొనర్చి శివునిఁ బ్రసన్నునిగాఁ జేసికొని యొకనాటియుద్ధమున నర్జునునిఁదప్పఁ దక్కినపాండవులశౌర్యము వారింపఁగలసామర్థ్యము వరముగాఁ గ్రహించెను. ఇప్పుడది యాతని కక్కఱకు వచ్చెను.

వీరు లందఱును గలసి యభిమన్యుని విగతరథునిగాఁ జేసిరి. మొగ్గరమునఁ దనవా రెవ్వరును లేకుండ నాతఁ డొంటిగఁ జిక్కెను. రథము పోయిన వేఱొకరథమును, విల్లు పోయిన వేఱొకవిల్లును నిచ్చువా రెవ్వరును లేకపోయిరి. సైంధవు

డడ్డపడక పోయినచో భీమాదులాతనికి సాహాయ్యము చేసియే యుందురు. కాని యట్టిది యొకవలేదు. అభిమన్యుఁడు తా నింక మరణించుట సత్య మని తలంచి, యుద్ధైర్యముచుమాత్ర ము పొందక, గదామాత్రసహాయుఁడై యుద్ధమునకుఁ గడం గెను. దుర్యోధనసుతుఁడగు లక్ష్మణుఁ డభిమన్యుని దాఁకి హ తుం డయ్యెను. తరువాత దుశ్శాసనసుతుఁడు సౌభద్రునితో గదాయుద్ధమునకుఁ గడంగి ఘోరముగఁ బోరెను. అయ్యవస రమున నొకరిగదాప్రహారము లొకరికిఁ దాఁకి యిరువురును విగతజీవు లయిరి. అభిమన్యునిమృతికిఁ గౌరవసైన్యములు సం తోషధ్వనిఁ గావించెను. పాండవబలంబులలో నాహాకారము లుప్పతిల్లెను.

ఆ బాలవీరశిఖామణి, యాసమరసాహితీసంపన్నుఁ డగు నభిమన్యుఁడు రణమునఁ బెక్కండ్రి యోధుల నుక్కడఁగించి, మడిసినచోఁ దక్కనవీరులమాట, నావల చూచుకొంద మను నట్లు కురువీరులకు భయము గలిగించి, తుదకు వీరస్వర్గము పొందినాఁడు.

ఆహా! అభిమన్యూ! వీరకుమారశేఖరా! నీయసదృశ పరాక్రమశౌర్యములచేతనీజన్మముధన్యమైనది. నీతల్లిదండ్రులు కృతార్థులైరి. మాభరతవంశమున కెల్లఁ గీర్తిఁ దెచ్చితివి. నీపవి త్రనామము భారతీయులు నిరంతరము స్మరించునట్లు చేసితివి.

---

# 5 వృషకేతుఁడు.



వృషకేతుఁడు కర్ణునికొడుకు. భారతయుద్ధానంతరమునఁ బాండవులు కర్ణుఁడు తమ కగ్రజుఁడని తెలిసికొని మిగుల దుఃఖించి, యాతనికుమారుఁ డగు నీతనిఁ దమయొద్ద నుంచుకొనిరి. వృషకేతుఁడు పాండవులయందు మిగుల భక్తి గలిగి సేవించుచుండెను. ఈతఁడునిరుపమానశస్త్రాస్త్రసంవేది. తండ్రి యగు కర్ణునితో సమానుఁడు. ధర్మరాజశ్వమేధయాగము సేయ సమకట్టి యజ్ఞాశ్వమును విడిచినప్పుడు దాని కంగరక్షకుఁడుగా భీమాదులతో నీవీరకుమారశేఖరుఁడుగూడ నరిగెను. అట్టిసమయమున భద్రావతీపురాధీశ్వరుఁడగు యావనాశ్వధరణీపాలునితో నీతనికిఁ బోరాటము గలిగెను. యావనాశ్వునిక్రతువాజిని భీముఁడును, ఘటోత్కచునిసుతుండగు మేఘవర్ణుఁడును హరించుకొని పోయిరి. తత్కారణంబున యావనాశ్వుఁడు వారితో యుద్ధము సేయుటకు వచ్చెను. ఆతని నెదిరించుటకు వృషకేతుఁడు నిలిచియుండెను. యావనాశ్వుఁడు రణభూమిం బ్రవేశించి వృషకేతుం గాంచి, యాతని పరాక్రమధైర్యాదిగుణములకును, దేశమునకును నద్భుతమంది "ఓయీ! బాలకా! నీకులగోత్రనామములు ముందుగా నెఱుంగనిదే కయ్యము సేయరాదు. కావున వచింపు" మనెను. అందులకు వృషకేతుఁడు "రాజేంద్రా! కశ్యపుఁడు వంశకర్త. సూర్య

సుతుండును; ద్రైలోక్యవినుతవరిదాతయునగు కర్ణుఁడు నాకుఁ దండ్రి. నన్ను వృషకేతుఁ డందురు. ధర్మసూనునియశ్వమేధ మునకై భవదీయమఖవాజిఁ బట్టితి” మని పలికెను. అంతకు ముందే యౌవనాశ్వునిసేనతో నక్కుమారుఁడు సంగర మాచ రించియుండుటచే యౌవనాశ్వుఁ డాతనిగాంచి “వత్సా! నీ శౌర్యమునకుఁ గడు మెచ్చితిని. సంగర మొనర్చి మిగుల నలసి యుంటివి. ఇంచుక విశ్రమించి యలసటఁ బాపుకొనుము. అదియుంగాక నీవు పదాతివి. నేను రథికుఁడ. అట్టిచో నీతో నధర్మయుద్ధము సేయుటకు నాచిత్తము సమ్మతింపదు. కావున రథము నిచ్చెద గైకొను” మని వచించెను. అందులకు వృష కేతుఁడు “యౌవనాశ్వధరణీపాలా! నీవు నాయందుఁ గృపాంత రంగుడవై రథము నిచ్చెదనని పలికితివి. అందులకు సంత సించితినిగాని, యయ్యది గైకొనుటకు మాత్రము నాచిత్తము సమ్మతింపదు. ఇంద్రునంతటివాని నర్థిగాఁ జేసినకర్ణునిపుత్త్రుఁ డనైననేను నీవిచ్చురథమును గైకొంటినేని మైత్త్రియే ఘటి ల్లునుగాని సమర మగునా ? కావున నందులకు సమ్మతింపఁ జాల. నేను పదాతి నని నీ వావంతయు సంశయింపఁ బనిలేదు. బాలుఁడ నని తలంపవలదు, శౌర్యసాహసములకు బాలుఁ డైననేమి? నీకు సాహాయ్యము సేయఁదలచి నీబంధుజనులును బుత్త్రపౌత్త్రాదులును, రథారూఢులై యరుదెంచి సంగ

రంబునకుఁ గాలు ద్రిప్పుచున్నారు. నే నేకాకి నని నీవు తలంప వలదు. ముకుందుని కృపయే నా కక్షుబ్ధం బని నమ్ముము."
అని వచించెను.

యౌవనాశ్వునకును నీతనికిని భయంకరమైన యుద్ధము జరిగెను. అందు యౌవనాశ్వుఁడు వృషకేతుని శరప్రహారమున నేలఁగూల వృషకేతుఁడు వానియెడల జాలి వహించి భగవంతుం డగు వాసుదేవునిఁ దలంచి యాతని బునర్జీవితునిఁ జేసెను. అప్పుడు యౌవనాశ్వుఁడు వృషకేతుఁ గౌఁగలించుకొని "వత్సా! వృషకేతూ! నీవు నన్నుఁ బ్రోచిన కారుణ్యమూర్తివి. పాండవుల నెఱింగియు మీతో రణమునకు మార్కొని వెఱ్ఱినైతి. ప్రాణసమానమైన మిత్రునకుఁ బ్రాణములొసంగుటయే మైత్రికి ఫలము. అర్థిజనాభీష్టప్రదాత యైనసీజనకుఁ డాలంబునఁ దెగినవారికి నీవలెఁ బ్రాణంబు లొసంగలేదు. నీవాతనికంటె నెక్కువకీర్తి గాంచఁగల్గితివి" యని పలికి పాండవులకుఁ గడుఁ గూర్చు మిత్రుఁడయ్యెను.



రాజా ప్రెస్ రాజమండ్రి.